# సీతాకల్యాణము

—•) ౫ అంకముల నాటకము (•—



ఇది,

వీరమతీచరిత్రము, పద్మావతీవిజయము, చంద్రనృపాలచరిత్రము,

రామాయణనాటకములు రచించిన,

## కవిసింహ. దుర్భాక. రాజశేఖరశతావధాని

గారిచే రచియింపఁబడి



ప్రొద్దుటూరు జానకీ ముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడినది.

1925.



(వెల రు. 0—8—0)

Presented to C.P. Brown Memorial Library Anantapur

By the Authors daughter

Smt Kameswari Anantaram

(1991)

శ్రీ దేవ్యై నమః

# ఉపోద్ఘాతము.



శ్రీ సీతాకల్యాణము:— ఇది యైదంకముల నాటకము. గ్రంథకర్తలు సుప్రసిద్ధకవులు శతావధానులు కవిసింహ బిరుదాంచితులు నగు బ్రహ్మశ్రీ దుర్భాక రాజశేఖర కవిగారు. ఈనాటకమును సమగ్రముగాఁ జదువు భాగ్యము నాకులభించినది. ఉపోద్ఘాతము వ్రాయఁ బ్రేరితుఁడనైతిని. ఇదియు నొకభాగ్యమనియే యబ్బురపడుచున్నాఁడను.

ఇందలి యితివృత్తము సర్వజనవిదితమే గాని క్రొత్తది గాదు. ఇట్టి నాటకమును వ్రాయనేలయని ప్రశ్నింపరాదు. విచిత్రతరాలంకార విశేషములచే సముచితకథాకల్పనలచేఁ బాఠకులకు హృద్యముగ నుండుటచే నిది క్రొత్తకథగనే యుండును. అట్టిమార్పులిందుఁ గలవా యనునదియే యిఁకఁ బ్రశ్నము.

కావ్యము శ్రవ్యదృశ్య భేదములచే ద్వివిధముగఁ బరిగణింపఁ బడినది.

శ్లో॥ వాక్యం రసాత్మకం కావ్యం దోషాస్తస్యాపకర్షకాః
ఉత్కర్షహేతవః ప్రోక్తా గుణాలంకారరీతయః॥

అని సాహిత్యదర్పణము తెలుపుచున్నది. వ్యంజకతాసంబంధేన రసాదిమద్వాక్యత్వమ్ కావ్యత్వమ్ అని పెద్దలు సిద్ధాంతీకరించిరి. కాఁబట్టి రసమే నాటకమునకుఁ బ్రాణము. అదియొదవనిచో నది నాటకము కాదు. బూటకము. ఏవో నాలుగు పద్యములు పదిమాటలు చేర్చిన నది నాటకమగునేని చెంచునాటకమే ప్రథమ తాంబూలార్హము కావలసివచ్చును. ఎవరో కొందఱు బాగున్నదన్నదికూడ నాటకముగాదు. అటులైనఁ బైనాటకమే తత్పాత్రము. కావున రసికసమాదృతిం గాంచి

శ్లో॥ చతుర్వర్గఫలప్రాప్తి స్సుఖాదల్పధియామపి
కావ్యాదేవ యతస్తేన తత్స్వరూపం నిరూప్యతే.

అను నభియుక్తోక్తి ననుసరించి యైహికాముష్మికసుఖప్రదాయకమగునది కావ్యము. అదియే దృశ్యమైనచో నాటకమనంబడు.

శ్లో॥ దృశ్యశ్రవ్యత్వ భేదేన పునఃకావ్యం ద్విధామతం
దృశ్యం తత్రాభినేయం తద్రూపారోపాత్తు రూపకం.

అను ప్రాచీనోక్తిననుసరించి యభినయార్హమగునది దృశ్యమనఁబడును. రామాదిరూపముల నవలంబించుట రూపకమనఁబడును. కథానాయికానాయకాదుల కాలమున ననుసరించి కథను వినిపించుట, ఆకాలమే యీకాలమను భావము పుట్టించి సదాచారాదుల నలవడఁజేసికొనఁ దగునను బుద్ధి ద్రష్టలకుం గలుగునట్లు చేయుటయే నాటకప్రధానాభిప్రాయము. అనఁగాఁ బ్రాచీనకాల మహారాజాది చరితమును జదివి గ్రహించుటకంటె నట్లే యభినయించుటచే శీఘ్రముగా నెఱుఁగఁదగియుండునుగాన నట్టి మహోపకారము లోకులకుఁ గలుగఁజేయుట కవికింగర్తవ్యము. అట్లుకాక యేవో నాలుగుపద్యములు పదిపాటలు నూఱుమాటలుచేర్చి తనఛాయాపటముచే నలంకరించి ముద్రించి దానిరంగమున నభినయింప రసజ్ఞులుకాని కొందఱు కరతాళధ్వను లొనరించుచు సెబాసని వినుతింప నదియొక గొప్పయనుకొనువాఁడు కవికాఁడు, అదియొక నాటకముకాదు.

లోకులకు నాటకము చేయు మహోపకారము లితరగ్రంథములు చేయఁజాలవనుటసిద్ధాంతము. అభినయాదులచే దుఃఖమును దొలఁగించి రసవత్తరపద్యములచే సంతోషమును గల్పించి సందర్భోచితరీతుల దురాచారములఁ దొలఁగించి యింతింతనరాని యుపకారమొనరించునది నాటకముకాక మఱేదగును?

అట్టినాటకము లీకాలమున విపరీతఫలప్రదములగుచున్నవి. ఆదోషము నాటకకర్తలదిగాని ద్రష్టలదికాదు. నాటకము వ్రాయుటలోఁ గవి జాగరూకుఁడై మెలఁగవలయు. లోకాచారములఁ (నాటకకథాకాలము నాటివి) జక్కఁగ నాలోచించి రసభంగముకాకుండ పాత్రోచితముగా భాషనుండఁజేసి తనశక్తినిగనబఱుపవలయునే కాని యిష్టానుసారము ప్రవర్తింపరాదు. ఒకప్పుడు స్వేచ్ఛగాఁ బ్రాచీనాచారములఁ బాటింపక తత్కాలాచారములఁ నాటకకథాకాలమున నున్నట్లు పొదిగి వ్రాసినచో నదియెప్పుడయిన నపకీర్తిని బొందక తప్పదుకదా.

పామరజనుల నలరించినఁ జాలునన్నచో వీథినాటకము లుండనేయున్నవి. కథయంతయు నందుండును. రాత్రినాలుగుజాములు విసుగునొందక యాడుదురు. ధనవ్యయము చాలఁగొలఁది. అవిచాలక యీప్రయత్నమేలొకో తెలియకున్నది. విద్యావంతులు హర్షించుటయే ప్రధానమన్నచో సకలలక్షణయుక్తముగ నాటకములరారఁదగుఁగాని స్వేచ్ఛపనికిరాదు.

కాలోచితముగా మార్పుల నొందవలదా యనునది యింకొకప్రశ్నము. ఆ మార్పేది? అన్నది దానిపైఁ బ్రశ్నము. హరిశ్చంద్రచక్రవర్తికథ నుదాహరణము

గాఁ దీసికొందము. ఆమహామహుని రాజ్యకాలమునఁ నున్న ప్రజాప్రభు సంబంధాదుల నాకాలపుఁ బ్రజల యలవాటుల, నక్లే తెలిపి యప్పటి సత్యనిరతిని, రాజభక్తిని, సదాచారాదులను దెలుపుట న్యాయమా? ఈకాలపు టాచారములను, సంఘసంస్కర్తల యుత్సాహము, వరశుల్కాది మహోపకారకృత్యములను జేర్చుట న్యాయమా? మార్పననిట్టిదేకదా? ఇదియుఁగాక సదిపాటల సెన్కునగాఁ జేర్చుటయా! తొలుదొల్తె నెవ్వరికిఁ దెలియకుండ రాజు కొలువుకూటము నలంకరించునట్లు చేయుటయా? నాటకకథ యెట్టిదో కరపత్రము ద్వారా తెలిపితిమిగాన నింక నాంద్యాదు లేలనివిరమించుటయా? మార్పనఁగా నర్థమేమో తోఁచకున్నది. సుజేయుఁ బాత్రప్రవేశమున సాంకర్యము గలిగించుట, భోజనవిహారాదులఁ గనఁబఱచుట, మంత్రీ! భోజనమునకు వేళయైనది పోదమా? యనిరాజుచేతఁ బల్కించుట, సందర్భము విడిచి కవిని బొగడించుట, కథ తికమకగాఁ గల్పించుట, యీమొదలగునవి ప్రకృతకాలోచితముగా మార్పనొందించినఁ గాని నాటకము కాదేమోయను శంక పొడమెడు. నాందీపద్యము కథాలేశమును గూడ సూచింపకుండుట ప్రధానమేమో? ఈమార్పున లోకమునకు మహోపకారము గల్గునేమో యన్న వేఱొకశంక యుదయించెడు. ఇట్టివికాక తక్కినవి చేర్చవలసినంతలోపముగా మనపూర్వులు లక్షణగ్రంథముల వ్రాయలేదు.

ఇట్టియపలక్షణపు మార్పులఁ జోలికిం బోక కవికడు జాగరూకుఁడై పరిశీలింప వలసియుండును. నాటకము వ్రాయుటయేగాక నాటకముపఠించి రసమును గ్రహించుట చాలఁ గష్టమైనపని. అట్టికృత్యము నీరుమజ్జిగవలెనైనది. ఇంకరసమున్ననేమో నాటకమర్యాదలన్న నేవో, పాటల పరిపాటి యెట్టిదో భగవంతునికే తెలియును. ఇట్టు లౌట నాటకము వ్రాయుట మంచినీళ్ళపాటిదైనది. రసము నిత్యభోజనోపకరణమే యనక తప్పదుగదా!.

ఇఁకఁ బ్రకృత మనుసరించెదను. ఈసీతాకల్యాణమునఁ గవియెట్టిపరిశ్రమము చేసెనో తెలుపుటయే యిటఁ బ్రధానము. రామజననమునకుఁ దొలికథయనఁదగు పుత్రికామేష్టిమొదలు సీతాకల్యాణము వఱకుఁగల కథ యీరూపకమున వ్రాయఁబడినది. పద్యములు సులలితపదభూయిష్ఠములై శ్రోత్రపేయములై రసాలవాలములయియున్నవి. కవిగారూ! తమరె యీపద్యమున కర్థముచెప్పుఁడు అని యడుగ నక్కఱలేక తద్భావము చక్కఁగాఁ దెలియునట్లు పద్యములలరుచున్నవి. ఉచితస్థలములనే పద్యములనిర్మించి కవి కృతకృత్యుఁడయ్యెను. తత్తత్పాత్రమర్యాదలను దెలుపఁజాలు పదములనేమాటలయందుఁ బ్రయోగించి తనవిచక్షణతవెల్ల

డించెను. కథాపోషణమున నుపయుక్తముగాని పాత్రప్రవేశమున నాటకము పరిపాటిఁజెఱుపక తనయభిజ్ఞతఁదెల్పెను. రామాదులనోట రసవత్తరవాక్యములఁ బల్కించి తనమనోగాంభీర్యమును వెలయించెను. హరచాపమును సభలోఁ బ్రవేశపెట్టుతఱిని, దాని నెక్కిడుఁడని రాకొమరులఁ బిల్చునపుడును గవి తన యసమానప్రతిభను వెల్లడించెను. విష్కంభరూపమున గంగాధరశాస్త్రి మాధవులఁ దెచ్చిపెట్టి తనచమత్కృతిని లోకజ్ఞానమును బండితులకుం దెలియఁజేసెను. ఇట్లు ప్రతివిషయమును జెప్పఁబూనుటకన్న నాటకమునే పఠించిన మేలని తెల్పుటయుక్తముకాన వదలితిని.

విశ్వామిత్రుఁడు రామునింబంపుమని దశరథుం గోరు ఘట్టమునఁగవి తనకవిసింహ బిరుదమును సార్థకముచేసికొనియె ననకతప్పదు. పద్యములు రత్నములవలె వీనులకు విందుగూర్చుచున్నవి. లేనిపోని కల్పనలచేఁ బద్యములు వ్రాయక వాడుకమాటలం జేర్చియే పద్యముల ముద్దులుమూటగట్టునట్లలరించెను.

చ॥ అఱువదియేండ్లనుండి తనియన్ మహిఁబాలనచేసి భోగ భా
గ్యరతులు కష్టసౌఖ్యములు గన్గొని కాటికిఁగాళ్ళుసాఁచుచున్
జరను గృశించునేనకట! చల్లఁగ నింటను గూరుచుండి యే
మెఱుఁగనిరాముఁబంపిన మునీశ్వర!లోకము నన్నుదూఱదే?

అను నీపద్యమును బఠించినవోఁ గవి తెలివితేటలు వెల్లడియగు. ఇందుఁదన సుంగలలోకజ్ఞానము జనులయాభ్యాసముల నెఱుంగుట యనుభావములు ప్రథమద్వితీయపాదములనుండి తేలును. కాటికిఁగాళ్ళుసాఁచుచున్ అనుటచే రేపోమాపో దేహత్యాగము చేయుటకు సిద్ధముగానున్నాఁడననియు ఇట్టిసమయమున జ్యేష్ఠపుత్రునెడఁబాయుట శాస్త్రవిహీనముకదా యనియు; జరనుగృశించునేననుటచేఁ ధైర్యమును దృఢపఱచుచు దేహపాటవముకూడఁదప్పినది బ్రదుకుదమన్నను దేహము సుఖదాయక మిఁకఁగాదనియుఁ, గావున "పుత్రమంతేచకర్మణి" యన్నవాక్యము నీకుమాత్రము దెలియదా?యనియుఁదేలును. చల్లఁగనింటను గూరుచుండిఅనుటచే సుఖార్హుఁడై కష్టములను గలలో నయిన నెఱుంగని రామునిం బంపుమనుట పాడియా యనియు, యేమెఱుఁగని రాముని అనుటచేఁ బుత్రస్తుతి వృద్ధికరముకాదుగాన నకృతాస్త్రుఁడనియు, లోకమునన్ను దూఱదే అనుటచే నేనొక వేళనీకు భయంపడి రామునిం బంపినఁ గౌసల్యయందీ రాజునకుఁ బ్రీతితక్కువ. తత్పుత్రునియందు నంతియే కానఁ జిన్నభార్య కొడుకుచెంతనున్నఁజాలు. తాటకా సుబాహుమారీచప్రముఖ దుష్టదానవ పటల మధివసించు కానలకుఁ బాలికొడుకుఁ బం

పినని లోపమయిన ననకుందురా? యనియు వెల్లడియగు. ఇట్టివెన్నియో భావము లిందిమిడియున్నవి. అసమర్థుఁడనగుటచే వ్రాయఁజాలకున్నాఁడఁగాని, రామునకు గుట నీకుఁగూడ న్యాయముకాదను భావమును యుక్తియుక్తముగ సిద్ధాంతముచేసి కవి ముసలియగుతండ్రి వార్ధకమునఁ గన్నకొడుకుపయి నిట్టిప్రేమగలవాఁడై యుండు నన్న తనలోకజ్ఞానమును సర్వతోముఖమునఁ దెలిపెను. ఇట్టిపద్యరత్నము లెన్నియో యిందున్నవి. వానినన్నింటిని జర్చించి యీపద్యముల నీయర్థసారస్యముకలదని చూపనేరకున్నాఁడను గాని వేఱుగాదు.

ఈనాటకమున నింకొక్క ముఖ్యవిషయము చర్చింపఁదగినదిగనున్నది. పంచమాంకమున శ్రీరామపరశురాముల సంభాషణముగలదు. ఇప్పట్టునఁగవి కడుం గడుఁ జమత్కృతి మెఱయ యవనిక నలంకరించెను. పరశురాముఁడు దురహంకృతి విజృంభిఁగినట్లు, శ్రీరాముఁడు తనపౌరుషమునకు భంగమురానీయక మాటలాడి నట్లు కొందఱు వ్రాసియున్నారు. అట్లుగాక యీకవిశేఖరుఁడు పరశురాముఁడు భగవదవతారమనుట వెల్లడించుచు, గురుదేవద్విజభక్తుఁడు రాముఁడనుటను వెల్లడించెను. పరశురామునివాక్కులందు గంభీరార్థముగలదు. రామచంద్రునివాక్యములందుఁ గడువినయముట్టిపడుచుండును. "నేనవతరించినపనిపూర్తిచేసితిని. ఇఁకనీవవతరించి నపనిని జేయఁబూనుము." అనుటయే యీసంభాషణసారమని తేలకమానదు. మఱియు దశరథుఁడు పరశురామునిఁబ్రార్థించుపట్టునఁ గలపద్యము లమృతమునుజిలకరించుచున్నవి. పుత్రవాత్సల్యమును దనపడిన కష్టములను దెలుపుచు నాపద్యములు సరసుల నానందరసమున ముంచుచున్నవి.

సీసపద్యము చివరనున్న యీ తేటగీతిం బరికింపుఁడు.

తే॥గీ॥ నేనువృద్ధుఁడఁ; బెక్కుఁడు ◆ లిడుమపడిన
వాఁడఁ; నన్యథాగతిలేని ◆ వాఁడ; నీప
దములకెఱఁగిన వాఁడఁ; జి ◆ త్తంబుకఱఁగి
పుత్రభిక్షనొసఁగి నన్నుఁ ◆ బ్రోవవయ్య!

దీనియర్థమును వివరించివ్రాయఁ జాలిన చోటు దొరకనందులకువిచారించుచున్నాఁడను. నాటకమునకన్నఁ బీఠిక పెద్దది యనినవ్వుదురన్న భయము ననుసరించి బాధించెడిని. నుంతవ్రాయక విడువఁజాలకున్నాఁడను.

నేనువృద్ధుఁడఁ ఇంకసంతానముగలుగునను నాశలేదయ్యా యనుభావమిది తెల్పును. పెక్కుఁడు లిడుమపడినవాఁడఁ నీభయమున నాయాయువంతయు ముగిసినదే మరల వచ్చితివా? సకలశ్రమములకు లోఁబడి నీబాధకై. యెన్నియో వివాహములు చేసికొంటినే? మరలఁ బ్రత్యక్షమైతివే. ఇఁకనాగతియేమను నర్థము

విశదమగును. నీపదములకొఱఁగినవాఁడ అన్యథాశరణమ్ నాస్తి త్వమేవశరణంమమ అని పాదములు తలసోఁకమ్రొక్కినాఁడ స్వామీ! కాపాడుము. ఇంతటి చక్రవర్తి నయి సూర్యవంశమునఁ బుట్టి యింద్రాదులకు సాయమొనరింపఁజాలి దిగ్విజయ మొనరించి యసదృశయశఃకీర్తులఁగాంచి యరిజనకాలాంతకుఁడనై క్షత్రియకులాలంకారభూతుఁడనైయున్న నేను బీదబ్రాహ్మణుఁడవగు నీపదముల శిరముచేర్చి దీనుఁడనై రక్షింపుమా! యని వేఁడుచున్నాఁడ. ఇట్టి నన్నుఁ గాపాడుమా! యను నర్థమీవాక్యమునుండి బహిర్గతమగును. ఇట్లు పరిశీలించిన కొలఁది చమత్కృతులు వెలువడునుగాని " అతిసర్వత్ర వర్జయేత్ " అను సూక్తిననుసరించి వదలుచున్నాఁడను.

శ్రీరాముఁడు పరశురామునితో

తే॥ గీ॥ "రఘుకులజులైనరాజులు బ్రాహ్మణులను
నిండుభక్తిని బూజింప నేర్తుగాని
కదనరంగంబులమువారిఁ బొదివిపట్టి
నిశితశరముల నొప్పింప నేరరయ్య!"

అనిపలికెను. ఈపద్యమున శ్రీరామచంద్రుని సౌజన్యము భావగాంభీర్యము సముచితవాక్పరిపాటియు విలీనములయి యున్నవి.

ఇట్లు పాత్రోచితముగ నర్థమును బోషించు ఘట్టము లెన్నియోగలవు. ఇట్టి యుత్కృష్టనాటకరత్నమును వ్రాసి కవి ధన్యుఁడయ్యెను. ఇట్లే రామాయణమంతయు నాటకములుగా వ్రాసి యీరాజశేఖరకవి తనకవిరాజశేఖరత వెల్లడించుచుఁ ద్రిలింగదేశమునకు సత్కీర్తిని దెచ్చుఁగాతమని వారక కోరుచున్నాఁడను.

ఈ రసవత్తరనాటకము కవియశస్సును వేనోళ్లఁ జాటుచున్నది. ఇట్టినాటకములకుఁజేయూఁత యొసఁగి నాటకసభలు కవులఁ బ్రోత్సహించుఁ గాక. ఈనాటకరత్నము చిరంతనముగా నిలవెలసి స్వప్రభల దశదిశల వెలయఁ జేసి దత్తమండల విఖ్యాతిని బెంపొందించుఁగాత. త్వరలోఁ దక్కుంగలరామాయణనాటకములఁ బ్రకటించికవివర్యుఁడుతనకవితాశక్తినిలోకులకుఁదెలిపి కృతకృత్యుఁడగునుగాక. పరశ్రీయస్సునసహించుగుణము గలవిద్వత్కవులీ రాజశేఖరకవి నాశీర్వదింతురుగాక.

ఇంతకన్ననెక్కువవిషయములు వ్రాయఁజాలని నేను లేఖినికి విశ్రాంతి నిచ్చుచున్నాను.

కడప.
5-3-25.

ఇట్లు
విద్వద్విధేయుఁడు
జనమంచి-శేషాద్రిశర్మ.

# పీఠిక.

---

మా పురమునందలి "రాజశేఖరవిలాస" నాటకసమాజ సభ్యులు తొలుత నాచే రచియింపఁ బడిన హరిశ్చంద్ర చరిత్రమును బ్రదర్శించి పిదప రామాయణము నాదఁదలఁచి నాటకములుగ వ్రాసియిమ్మని కోరఁగాఁ బ్రథమమున నారణ్యకాండమునందలి కథను "సీతాపహరణము" నుపేర వ్రాసితిని. అయ్యది యనేకపర్యాయములు ప్రదర్శింపఁబడినది. తరువాత బాలకాండకథను "సీతాకల్యాణము"నుపేరునను నయోధ్యా కాండకథను "సీతారామరాజ్యవియోగము"ను పేరునను కిష్కింధాసుందరకాండములయందలి కథను "సీతాన్వేషణము"ను పేరునను యుద్ధకాండకథను "సీతాపరిగ్రహణము"ను పేరునను రామాయణము షట్కాండములయందలి కథ నైదైదంకములు గల యైదు నాటకములుగ వ్రాసితిని.

2. పద్యరూపమునను గద్యరూపమునను రూపకరూపమునను రామాయణము లెన్నియేని గ్రంథములుండ మఱల దానినాటక రూపమున వెలయించుటపరమా యనియడుగవచ్చును. అందుకుసమాధానముగఁ బూర్వకవి కంకంటిపాపరాజ ప్రధానుని యీక్రిందిపద్యములను నివేదించుకొనుచున్నాఁడను.

మ॥ "వరుసన్ దిక్కనయజ్వ నిర్వచన కా ♦ వ్యంబున్ దగన్ జేసెను
త్తరరామాయణమందునన్ మఱిప్రబం ♦ ధంబూని నిర్మించు టే
సరసత్వంబ"ని ప్రాజ్ఞులార! నిరసిం ♦ చన్ బోకుఁడీ! రాఘవే
శ్వరుచారిత్రము నెందరెన్ని గతులన్ ♦ వర్ణించినన్ గ్రాలదే!.

ఉ॥ మానక కర్మభూమిపయి ♦ మానుష దేహముతో హితాహిత
జ్ఞానమెఱుంగు బ్రాహ్మణుఁడు ♦ చారుకవిత్వము నేర్చి జానకీ
జానికథల్ రచింపక యు ♦ సత్కథ లెన్నిరచించె నేనియున్
వాని వివేకమేమిటికి? ♦ వాని కవిత్వమహత్త్వమేటికిన్?

తారకనామమగు రామనామ మెవ్వఁ డెవ్వఁడేయేస్థలమున నేయే కాలంబున నేయేదీక్షతోఁ గీర్తించునో తత్తదుచితరీతి నవ్యయానంద మొసఁగఁజాలుట ధ్రువము.

3. కృతిప్రబంధ రచనమునఁ గవులకుఁగల స్వాతంత్ర్య మాధారముగఁ గథాకథనమున నొకటిరెండు చిన్నమార్పులు చేయఁబడినవి. జనకరాజమందిరమునఁ జంద్రశేఖర శరాసన సందర్శన సమయమున రామలక్ష్మణుల కెఱింగింపఁబడిన విశ్వామిత్ర చరిత్రాదు లౌచిత్యము ననుసరించి యుండుననిగాధేయ సవనరక్షాకాలంబున సిద్ధాశ్రమమున విశ్వామిత్రశిష్యుఁడగు గాలవునిచే రామలక్ష్మణుల కెఱింగింపఁ బడినవి. శ్రీరామ పరశురాముల సమాగమమును తత్సంవాదక్రమము నిరువురకును గౌరవావహముగ నుండు విధమునఁ బోషింపఁబడినవి. కథావిస్తరమైద్వయాంకమున నాయాభాగములఁ జూడఁదగు. నాలుగంకములతోఁ గల్యాణభాగము పూర్తియైనను మఱునాఁడే మిథిలనుండి యయోధ్యకు వచ్చుమార్గమున జరిగినదికావున భార్గవరామదశరథరాముల సమావేశ మిందయిదవ యంకముగఁ జేర్పఁబడినది.

4 నాటకశాలకు వచ్చి కూర్చుండి కూర్చుండక మునుపటినుండియే నిమిషమునకు నూఱుమాఱులు ముంజేతి గడియారముల మూతులుచూడ నలవాటుపడినయీ సమయములఁ గాలనష్టమును బ్రయాసమును దగ్గింపనెంచి ప్రస్తావము నొకటి రెండు పద్యములతో మాత్రము ముగించితిని.

5 నాకవిత్వమున నేగుణలేశము లేకున్నను నన్నాదరించి యీనాపొత్తమునకుపోద్ఘాతము వ్రాసి వన్నె చేకూర్చిన శ్రీమద్రామాయణ బ్రహ్మాండపురాణాదులకు వ్యాఖ్యానాద్యనేకోద్గ్రంథకర్తలును బాలసరస్వతీ కావ్యతీర్థాభినవ వాల్మీక్యాది బహుళ బిరుదాంచితులునగు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారికనేకవందనము లర్పించుచున్నాను. ఈగ్రంథము ముద్రించిన శ్రీజానకీముద్రాక్షరశాలాధికారియు నాచిరమిత్రుఁడునగు చిరంజీవి. గాడిచెర్ల. మధ్వమునిరావు నెడ నేనెంతయుఁ గృతజ్ఞత వహించుచున్నాను. శుద్ధప్రతినిసిద్ధము చేసియిచ్చిన నాయభేదమిత్రుఁడు కవిసింహ. గడియారము వెంకటశేషశాస్త్రి శతావధానిగారిని నేనుమిక్కిలి యభినుతించుచున్నాను.

ప్రొద్దుటూరు.
8—3—1925

ఇట్లు
కవిసింహ డి. రాజశేఖర
శతావధాని.

# కథాసంగ్రహము.



**ప్రథమాంకము:**—దశరథుఁడు పుత్రకామేష్టి నొనరించుచుండ, దేవతలు యజ్ఞభాగములఁ గొనవత్తురు. రావణునివలనఁ దమకుఁగలిగిన బాధల నింద్రాదులు విష్ణువునకెఱిఁగింతురు. విష్ణునియంశమున దశరథునకుఁ బుత్రులుదయించి వారు దానవ సంహారమొనరింతురని విష్ణుఁడు తెలుపఁగా హవిర్భాగములుగొని దేవతలు స్వనివాసముల కరుగుదురు. ప్రాజాపత్యపురుషుఁ డొసఁగిన పాయసమును దశరథుఁడు భార్యలకుఁబంచి పెట్టును.

**ద్వితీయాంకము:**—దశరథునొద్దకు విశ్వామిత్రుఁడరుదెంచి సవనరక్షార్థమై రాముని బంపఁగోరును. దశరథుఁడాలసింపఁగా గాధేయుఁడు కోపించును. వసిష్ఠుఁడు బోధించి రామలక్ష్మణులఁ గౌశికువెంట నంపఁగోరును. రామలక్ష్మణులు విశ్వామిత్రువెంటఁ బోవుదురు.

**తృతీయాంకము:**—సిద్ధాశ్రమమున సవనరక్షణ మొనర్చుతఱి గాలవుఁడు రామలక్ష్మణులకు విశ్వామిత్రచరిత్ర మెఱిఁగించును. మారీచసుబాహులు రాఁగా రాముఁడు శిక్షించును. సవనపూర్తియైనంత, విశ్వామిత్రుఁడు రామలక్ష్మణసహితుఁడై మిథిలానగరమునకు బయలుదేఱును.

**చతుర్థాంకము:**—స్వయంవరరంగము, విశ్వామిత్రుని సెలవుఁగైకొని రాముఁడు హరధనుర్భంగముగావించి సీతను బరిగ్రహించును.

**పంచమాంకము:**—అయోధ్యకువచ్చు మార్గమున దశరథాదులను బరశురాముఁడు సమీపించును. దశరథరామభార్గవరాముల సమావేశ సంవాదము లైనపిదప రాముఁడు వైష్ణవశరాసనము నెక్కిడఁగాఁ బరశురాముఁడు తనతపోబలము రాజరామునకొసంగి యాశీర్వదించును. మంగళము

# ఈనాటకమునవచ్చు పాత్రలు.

## పురుషులు

దశరథుఁడు — అయోధ్యానాయకుఁడు

వసిష్ఠుఁడు
ఋశ్యశృంగుఁడు
విశ్వామిత్రుఁడు
శతానందుఁడు } ఋషులు.

గాలవుఁడు — విశ్వామిత్రుని శిష్యుఁడు

బ్రహ్మ
విష్ణుఁడు } దేవతలు

యముఁడు
వాయువు
ఇంద్రుఁడు } దిక్పాలురు.

ధవళుఁడు — దశరథుని సేవకుడు

సుమంత్రుఁడు — దశరథుని మంత్రి

రామలక్ష్మణులు — దశరథుని పుత్రులు

మారీచ సుబాహులు — రాక్షసులు.

జనకుఁడు — విదేహపురరాజు

రణధీరుఁడు
జయసింహుఁడు
సుమతి
యశోధన్యుఁడు } నానాదేశ రాజన్యులు

గంగాధరశాస్త్రి
విష్ణుశర్మ } బ్రాహ్మణులు

మాధవుఁడు — గంగాధరశాస్త్రి శిష్యుఁడు

పరశురాముఁడు — జమదగ్ని పుత్రుఁడు.

## స్త్రీలు

కౌసల్య
సుమిత్ర
కైక } దశరథుభార్యలు

మంధర — కైకదాసి

సీత — జనకుని పుత్రిక

చెలికత్తియలు.

# సీతాకల్యాణము.



[నాంది.]

శా॥ శ్రీమత్పన్న దళాక్షునంశమున ధా ♦ త్రిన్ బుట్టువున్ జెంది వి
శ్వామిత్రుండొనరించు యాగమును ర ♦ క్షల్ సేసి భూతేశు ను
ద్దామప్రోన్నత చాపమున్ విఱిచి సీ ♦ తన్ బెండ్లియై భార్గవు
న్వేమెప్పించిన రామచంద్రుఁడొసఁగున్ ♦ నిర్నిద్రసౌఖ్యోన్నతుల్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి పుష్పాంజలిచల్లి)

పూజ్యులగు నోసభాస్తారులారా! లేఁతవెన్నెలలరు సంపూర్ణ పూర్ణిమా చంద్రబింబ సందర్శనమునఁ జకోరకమట్లు చిఱునగవు లొలుకు మీ నెమ్మొగములు గని నేనమందానందము నొందుచున్నాను.

సీ॥ రచియించెఁ దొల్త పీ ♦ రమతీచరిత్ర వెం
కటశాస్త్రి కడుఁగౌతు ♦ కమున మెచ్చ
నడిపించెఁగలముఁ జం ♦ డనృపాల చరితంబు
విరచించుచోఁ గవి ♦ వితతియలర
వ్రాయఁగా నేర్చె రా ♦ మాయణమును నాట
కములుగా రసపోష ♦ వముదనర్ప
లిఖియించె మేలి శై ♦ లిని బాలకులు స్తుతుల్
గావింపఁ బద్మావ ♦ తీవిజయము

తే॥గీ॥ నాచరించె ననేక శ ♦ తావధాన
ముల విబుధకోటులెల్ల నౌ ♦ దలలనూఁప
నతఁడు కవిరాజశేఖరుం ♦ డైన సుకవి
సింహబిరుదాంచితుఁడు రాజ ♦ శేఖరుండు.

తత్కృతమగు శ్రీరామాయణమునందలి సీతాకల్యాణనామకమగు బాలకాండము కథను నేఁడిచ్చటఁ బ్రదర్శింపఁ బోవుచున్నాము. నాటకమర్యాదాభిజ్ఞులగు విద్వదగ్రేసరు లందఱును కేవలరసాస్వాదనాతత్పరబుద్ధులయి యీనాటకరాజము నీక్షించి యానందించి మమ్ముఁ గృతకృత్యులఁ జేయుదురుగాత.

(నిష్క్రమించుచున్నాఁడు.)





శ్రీ

# సీతాకల్యాణము.

## ప్రథమాంకము.

అయోధ్యాపురము-యజ్ఞశాల.

ఋష్యశృంగ వసిష్ఠులును-దశరథుఁడు నతనిభార్యలుఁ నుపవిష్టులైయుండురు.

దశ:—వసిష్ఠమునీంద్రా! నీయానతిచొప్పున నేనును నాముగ్గురుపత్నులును నియతితో నుపవసించియున్నాము. ఇష్టినొనరింపఁ బ్రారంభింపుఁడు.

వసి:—వలసిన మంగళవస్తుసముదయమంతయుఁ జేరియున్నది. ఇష్టినొనరింప నుపక్రమించెదము.

దశ:—చిత్తము. రోమపాదమహారాజానుమతి శాంతాదేవియు ఋశ్యశృంగుఁడునుఁ బార్వతీపరమేశ్వరులవలె నిచటికి వచ్చియున్నారు. నీవెప్పుడును మాశుభమెంచఁగోరెడు మహానుభావుఁడవు.

క॥ తమయిూశిష్యుని పైఁగూ
రిమి నిటువచ్చితిరిగాక ♦ త్రిభువనసామ్రా
జ్యమొసంగిన నితరులగే
హములకు మీవంటిపూజ్యు ♦ లరుదెంచెదరే?.

ఋశ్య:— ఇందు మేను శ్రమపడునదేమున్నది. ఇకవ్యవధియేల? ప్రారంభించెద.

మ॥ శిరముల్ రెండు పదాలు రెండొకటియుం ♦ శృంగంబులుం నాలుగు
స్వరముల్ నాలుక లేడువెన్నెడు శుభా ♦ కారంబు ధూమధ్వజం
బరుదై యొప్పఁగ మేషవాహనముపై ♦ నాసీనతం జెంది యి
త్తఱిని వేదికఁ జేరుమా! పవనమి ♦ త్రా! సుప్రసన్నుండవై.

భగవానుఁడవగు కోయస్మిన్ కట్టారకా! యిష్టిజయప్రదముగ సాగునట్లనుగ్రహింపుము.

తే॥గీ॥ దశరథనృపాలమౌళి సం ♦ తానమొందఁ
బుత్రకామేష్టి నొనరింపఁ ♦ బూనినాఁడ
స్వస్వరూపంబులను వీడి ♦ యాగముఁగొన
శీఘ్రముగ రారె దేవతా ♦ శ్రేష్ఠులార!.

[దివినుండి యింద్రాది దేవతలును సత్యలోకమునుండి బ్రహ్మయుఁ బ్రవేశించుచున్నారు]

ఇంద్రుఁడు:—

మ॥ జగముల్ సర్వము నేమహాత్మకరుణం ♦ జన్మించె; నెవ్వానినా
లుగు మోముల్ వెడలించె వేదములు నా ♦ ల్గుం; హంసయె వ్వానికె
క్కఁగ వాహంబగు; నేమహామహుఁడు వా ♦ క్కాంతుండు లోకేశుఁడ
ట్టి గురుప్రాభవు నిన్ను నేఁడు కనుఁగొం ♦ టిం వారిజాతాసనా!.

ఆదినారాయణుని పొక్కిటనించి దేవతలకెల్లఁ బితామహుఁడవగు నో శతానందా! నీదర్శనమున ధన్యుఁడనైతిని.

బ్రహ్మ:—మహేంద్రా! పెద్దకాలమునకుఁ జూడఁగంటిని. త్రిలోకాధీశ్వరుఁడవగు నిన్నుఁజూచి నేనుమిక్కిలి సంతసించితిని. సుతబాంధవామాత్యసహితముగ నీకు సేమమేగదా! స్వర్గరాజ్యము నీచే నన్నివిధముల సుఖప్రదముగఁ బాలింపఁబడుచున్నదిగదా?.

ఇంద్ర:—దేవా! పరమబంధుభావమున నరయునప్పుడున్నది యున్నట్లు తెలుపుకొనక పోవుట పాడిగాదు. దుష్టరాక్షససమూహములు ప్రాణములతో నుండఁగా మాకు సేమమెక్కడిది? అందున నిదివఱకుండిన దైత్యులు గలిగించుచుండిన బాధలొకయెత్తు. లంకారాజ్యము నేలు రావణుఁడిపుడు పెట్టుబాధలు మఱియొకయెత్తు. మహాబలవంతుఁడైవాఁడు మాచే వెట్టిచేయించుచున్నాఁడు. ఇంతకాల

మెట్టులోయోర్చికొని యుంటిమి. ఇప్పుడుమస్వహాపై త్వరగా నినుదర్శించి యీవిషయమై నీతో మొఱలిడఁదలఁచియేయుంటిమి.

యముఁడు:— ఇంతలో నిక్కడ నీదర్శనము హఠాత్తుగా లభించినది. అనుగ్రహించి మాకా దుర్మార్గుని బాధ తొలఁగునటు చేయ వేడుచున్నాము.

బ్రహ్మ:— ఆరావణుఁడు మిమ్ముఁ బెట్టు బాధలను గుఱించి నేను కొంతకాలమునుండి వినుచున్నాను. కాని ముందుగ వరములిచ్చియుంటఁ జేసి యేమియుఁ జేయలేక యున్నకుంటిని. మిమ్ముఁ బెతెగక బాధించుచున్నాఁడు కావున నిక వాని నుపేక్షింపరాదు. రాక్షసాంతకుఁడు విష్ణుఁడిప్పుడే వచ్చుచుండును. ఆమహానుభావున కీవిషయ మెఱింగించుదము. ఆయన మీయాపదలఁ దప్పక పాపఁగలఁడు.

ఇంద్రుఁడు:— వేల్పుఁ బెద్దవగు నీవీవిషయమై యెత్తిచెప్పిన నారాయణుఁ డనుకూలవిధమున మెలఁగకపోఁడు.

యముఁడు:— ఓ సమస్తదేవతామండలములారా!

చ॥ స్ఫురదమలారవిందముల ♦ సొంపు హసించెడు నేత్రముల్ కృపా
దగములఁజిల్క సాగగను ♦ తఱగవఁగూడి మనోజ్ఞకాంచనాం
బరముధరించి యాగరుడ ♦ వాహనమందువసించి విష్ణుమూ
ర్తి రభసవృత్తి వాఁడె యరు ♦ దెంచెడి భక్తులకొంగుబంగరై.

త్రైగము | సంత్రాసము

బ్రహ్మ:— ఆనందమానందము. అమరప్రవరులారా! మహావిష్ణువునకు స్వాగతమొసఁగుదము.

[ప్రవేశము-విష్ణుఁడు.]

బ్రహ్మ:— ప్రియము

సీ॥ పాలఁబల్కుటువిదల ♦ పాపటలందు నే
యనఘుపాదములునా ♦ ట్యంబుసలుపు;
మునికోటిమానస ♦ పుండరీకముల నే
పురుషునంఘ్రులు భద్ర ♦ ముద్రఁదాల్పుఁ;
దిగ్దశకోటీరాగ్ర ♦ దివ్యరత్నముల నే
ధన్యునియడుగులు ♦ తాండవించుఁ;
నమరగంగాతరం ♦ గములందు నే దేవు
పదములఖ్యాతశోభలరహించు;

తే॥గీ॥ నట్టిలోకైకనాథుఁ గృ • పాంతరంగు
దేవదేవు మహాభాగు • దివ్య సభవుఁ
గంటిమో దేవ నిన్ను మా • కన్నులలరఁ
జలజలోచన! మిగులధ • న్యులము మేము.

విష్ణు:—పరమేష్ఠీ! సురజ్యేష్ఠుఁడవగు నీదర్శనము నాకుఁబ్రమోదకరము. మహేంద్రా! దిక్పాలకప్రవరులరగు నిన్నును శమనాదులనుఁ జూచి చాలసంతసించితిని. దేవతాధిపతులకందఱకును మోదమే కదా?. మీమీదెసలలో మీమీ యధికారములు పూర్ణముగఁ జెల్లుచున్నవి కదా?

ఇంద్రు:—మామా భార్యాసుతులతో మామా దేశములలో మేమంతయు మీదయవలన నివిషమువలెకుఁ గుశలముతో నున్నాము. అనఁగా నెట్టులో ప్రీతికిమాత్రమున్నాము. చతుర్దశభువనరక్షకుఁడవగు నిన్నుఁ జూచి కొంత యూరట గలుగుచున్నది. నీమూలమున మాయలమటవాయఁగలదని నమ్మియున్నాము. మాయెడ ననుగ్రహముంచవలెను.

విష్ణు:—మఱల నేవేని యుద్ధములు పొసఁగినవా? మీ బాధ లేవిధమైనవి?.

బ్రహ్మ:—మాధవా! వీరిక్రమ నీవొకింత గమనింపవలెను.

క॥ ఖలులగు రాక్షసహతకుల
వలన వచింపంగరాని • బాధలఁబడి వే
ల్పులు తమయాసల నీపయి
నిలిపి కొలువవచ్చినారు • నీరజనయనా!.

నీవుదప్ప దేవతలకేదుగడ లేదు. వీరి మొఱ్ఱల నాలించి యొక్కైన నుద్ధరింపుము.

విష్ణు:—ఆదినుండియు రాక్షసులు పొగరుమించి జగమ్ములకు క్షోభము గావించుచుండుటయు నేనునీశ్వరుఁడును వారలవారించుచుండుటయుఁ గాలక్రమమున నలవాటైనది. సద్హృదయులును నిరపరాధులునునగు దేవతలును మునులును వారికేయుపకృతి నైనఁ జేసియుండరే! మహేంద్రా! యిప్పుడు మీ కష్టములకుఁ గారణమగు నాఖలుఁ డెవ్వఁడో యెఱిఁగింపుము. తగుప్రతిక్రియఁ గావింపఁబ్రయత్నించెద.

ఇంద్రు:—ఆవశ్యము విన్నవించుకొందును.

ప్రథమాంకము.

చ. లవణపయోధిమధ్యమున • లంకయొకండు చెలంగు; దాని దా
నవకులభర్త విశ్రవసు • నందనుఁడై చెలువారు రావణుం
డవిరళశౌర్యుఁడేలు సక • లామరకోట్లజయించి తాపస
ప్రవరులనొంచి యీభువన • వారముసర్వము బాధపెట్టుచున్.

ఆరావణుఁడే మాకష్టములకెల్ల మూలకారణము. ఏదోయొకయుద్ధములేక వాఁడొక్కదినమైన నూరకుండఁడు.

తే.గీ. ఎట్టిదుర్లగ్నమున జన్మ • మెత్తినాఁడొ
రణముపేరన్నఁ బెండ్లిపే • రంటమల్లు;
దివముఁ బాలించుచుండెడు • దేవతలనఁ
బట్టిబెల్లంబు వానికో • పద్మనాభ!.

ఏదినమే నిమిషము వాఁడువచ్చిపైఁబడునోయని సకలామరసమూహములును ప్రాణములనఱచేతఁ దాల్చియుండిరి. ఇప్పుడు మనకుఁ దెలిసియుండు ప్రముఖులలో వానిదిగ్విజయయాత్రలలో నొకచోఁగాకున్న మఱియొకచోనయిన వానిధాటినిఁబడి యోడినవారేగాని వానియెదురఁబడనివారులేరు.

మ. వరుణున్ గెల్చెఁ గృతాంతునొంచెను విప • స్వంతున్ ధ్వతిన్ బాపెఁ జం
దురునిన్ మార్కొనె; నాకుబేరుననియం • దున్ మించె; నోడించెనా
గరుడవ్యాళుల; వారువీరనుచుఁ బ • ల్కన్ నేరఁ; బేర్వాసిమె
బరగన్ జాలినవారినందఱఁ గృశిం • పన్ జేసె గర్వోద్ధతిన్.

ఈపైఁజెప్పినవారినందఱ నొకటిరెండుమార్లుదర్శించెను. కాని యిటుపోవుచు నిటువచ్చుచు స్వర్గమునుమాత్రమెన్నఁడైననేమఱఁడు. భుజాటోపముతో వాడుకేవలముయుద్ధమేచేసిన విచారముండదు, కాని నీతిలేనివిధమునఁబ్రవర్తించి స్త్రీలను బలహీనులను వాఁడుపరిభవించువిధముతలపోసిన నెట్టివజ్రహృదయమునకయిన జాలిగలుగును. దేవా! నాస్వవిషయమునే కొంతవిన్నవించుకొందును.

క. కలలోకనలువురువేశ్యలు
కొలువుననాట్యములుజేసి • కుతుకమునాకున్
గొలుప సుధర్మకురా వా
రలువెఱతురు వీనివలని • రాయిడిననఘా!.

వారెంత భయమునవర్తించి యేమిప్రయోజనము? కుదకుఁ బత్యాశపొసనము క్కటిరే.

చ॥ అలికులవేణి నేల్పువెల • యాండ్రను రంభయనంగనోర్తు జా
బిలికళలూరువెన్నెలల • వెండిమలన్ జరియించుచుండఁగా
బలిమినిబట్టి బల్ రతుల • పాలొనరించె యథార్థ శిక్షలన్
గొలిపెడువారులేమిఁ దన • కున్ సరిలేరని గర్వరాసియై.

ఈరంభయేగాక ధాన్యమాలినియను మఱియొకయప్సరోవనిత యితనిమూలమున శాపగ్రస్తయై యొకకొలనులో మకరియై పడియున్నది. వీఁడు స్వర్గమునకువచ్చినపుడెల్ల నిట్టినీచకార్యములెన్నియో చేయుచుండును. దిక్పాలురలగర్వములు వీనికి కమండలువులఁబగిల్చి వారిదండములు వారివీపులపైఁ దాండవింపఁజేయుచుండును. నన్నెంతయో కారియపెట్టుచుండును. దేవతాచక్రవర్తిననియుఁ ద్రిలోకాధీశ్వరుఁడననియు నీవంటివారుగూడమన్నించు నేను చెనఁటిరక్కసుఁడారావణుఁడెదుర్కొనప్పుడేమి వాట్లు బడుచుందునో యాయీశ్వరుఁడెఱుఁగును.

చ॥ ఇతనివిచారముంచుమటు • లీతనిపుత్రుఁడు మేఘనాదుఁడు
గ్రితముఁడు నన్నుఁదోల్త సమ • రంబున గెల్చి జగత్త్రయంబునన్
స్తుతిఁగనిమించె; నాచెవుల • తోవిన నందఱు ''నింద్రజిత్తు''టం
చతనిఁ బిల్తు రెట్లుశిర • మక్కట! యెత్తిచరింతుఁ జెప్పుమా?.

ఇప్పుడువాని నొక్కరును మేఘనాదుఁడని తొలుతటి పేరునఁ బిలువరు. వాఁడును దననామ మింద్రజిత్తనియే చెప్పుకొనుచుండును. ఈయవమానమునకోర్చి స్వర్గమునువీడి వెడలిపోవుటయేలేదు. ఈతండ్రికొడుకు లొకరినొకరు మించినవారు. పూర్వము రాక్షసులవారించి స్వర్గముఁగాపాడుటకై తలప్రాణము తోకకువచ్చియుండెను. ఇప్పుడింద్రజిద్రావణులొనరించు బాధలుపడి నాకరాజ్యము నాకానరకముగా దనిపించినది. దేవా!

తే॥గీ॥ కల్పకము నందనమ్మును • గామగవియుఁ
దెల్లయేనుంగు వజ్రంబు • త్రిభువనముల
ప్రాజ్యసామ్రాజ్యమిచ్చి గౌ • రవమునిచ్చి
యసురబాధలఁబడఁ ద్రోయు • న్యాయమగునె?.

లోకములనెల్ల శ్రేష్ఠతమమగు త్రివిష్టపమునకధికారివయి విశేషించి నీకుఁ దోఁ బుట్టువువైన యొకనిమిషమైన మనశ్శాంతిలేక యొకానొకక్షుద్రరాక్షసునిచే నిట్లు బన్నముపడుచుండుట నీకుమాత్రము సమాధానముగనుండునా! దేవా! యీ దానవుని బాధలకు మేమొకనిమిషమైన నోర్వఁజాలము.

ఉ॥ ఈయమరవ్రజంబులకు నెల్లను నాఁడమృతంబువోసి దీ
ర్ఘాయువుఁ గల్గఁజేయుటఁ గటా! యిటు లైతిమి: లేకయున్నచో
నేయసురుండో మున్నె మము నెట్లొ యొనర్చునఁ గన్నుమూసి నే
డీయధికప్రయాసముల నెల్ల నెఱుంగకయుందుమచ్యుతా!.

అయ్యో! యీ దానవాధమునివలని కష్టములిట్లనిపించుచున్నవేకాని జగజ్జాలారాధ్యుండవగు నీకృపను లోటున్నదే!

విష్ణు:—మహేంద్రా! నీమాటల నత్యాదరమున వింటిని. త్రిలోకపూజ్యుఁడవగు నీకే బన్నముగలుగుట నిశ్చయముగ సంతాపకరము. నీవుచెప్పెడికొలందిని నాకా రావణునిపై కోపమగ్గలమగుచున్నది. ఆహా! రాక్షసుల దుండగము లెంతవఱకు వచ్చినవి!.

యముఁడు:—చెప్పఁదరముగాదు. ఆరావణుఁడొకమారు దిగ్విజయాభిలాష నేగుచుఁ ద్రోవలో వాఁడదృష్టవశమున సంయమనీపురముఁ జూచెను. అంత వాఁడు నాపురమును సమీపించి నన్నుఁ బట్టితెమ్మని వాని సేనాపతిఁ బ్రహస్తునిఁ బంపెను. దండధరుఁడనై మృత్యువును వెంటఁదీసికొని వాని నిదర్శింపఁబోయితిని. మాపుమేరలో నన్నుఁ బొడగాంచి రావణుఁడు,

కం॥ "అహహా"యంచని భయదా
ట్టహాసముచేసి నిలువఁబడఁగ మృత్యువుతా!
స్పృహఁదప్పి పడఁకి తప్పన
మహోత్పాతములకడ్రావాలె మాధవ! వింటే!.

నేనును భయభ్రాంతుల నూరక నిల్చిపోతిని. వాఁడును సంయమనీపురముఁ బ్రవేశించెను. కొందఱు పుష్పవిమానములఁ గూర్చుండి విహరించుచుండ "వారెవరు" నినన్నుఁ గద్దించియడిగెను. "భూలోకమున బుణ్యభాగులైచరించి యిచ్చటఁ దత్పుణ్యఫలము ననుభవించుచున్నార"ని నుడివితిని. "వారేజాతివార"ని ప్రశ్నించెను. "వారిలోఁ గొందఱుమానవులును దదితరులు ఖేచరులు" నని చెప్పితిని. అంత

వాసురవైరి కనుంగవమిడుంగుఱులురాల నాగ్రహోదగ్రుఁడై నన్నుఁ దేరిచూచి,

చ॥ "తులువలు దుష్టచిత్తులును ♦ ద్రోహులునై చరియించినట్టి యా
ఖలులను బుణ్యభాగులను ♦ గాగణియించి యిటుల్ విమానసం
స్థులవిహరింపఁ జేసితివి; ♦ కుత్సితవర్తన! దైత్యునొక్కనే
నిలిపితె! యిట్లుసౌఖ్యమున ♦ నిన్ని దెఖస్సముజేసిపుచ్చెదన్."

అని యావిమానములఁ గ్రిందఁబడఁగొట్టి యాపుణ్యపురుషులచెంపలూడఁగొట్టి పలుబాములఁ బెట్టె. చేయునదిలేక నేనూరకుంటిని. మఱికొంతదూరముపురిలోనికిరాఁగాఁ గొందఱునరకవాసులు వానికగపడిరి. "వారలెవ్వర"ని నన్నడిగెను.

చ॥ కలుషములాచరించి నర ♦ కంబునుబొందినపాపులన్న న
వ్వలననుఁ గూలఁద్రోసి యల ♦ పాపులనందఱ లేవఁదీయుచున్
దొలుతటివ్యోమయానములఁ ♦ తో విహరింపఁగఁ జేసి పుణ్యభా
గులవడిఁ దెచ్చి యానరక ♦ కూపములన్ బడఁద్రోసెనయ్యతా!.

క॥ బలిమిని నాపురమిట్టులు
తలక్రిందుగఁ జేసి "నన్నుఁ ♦ దాకి గెలిచెదో?
"గెలువఁగలేనోడితి"నని
పలుకుచు మ్రొక్కెదవో? శుంఠ! ♦ వచియింపుము" నెన్

ఇంతలో వానిదైతేయభటులు నాచిత్రగుప్తునిఁ దక్కిన నాకింకరులనుఁ గొంద ఱను నర్థచంద్రప్రయోగముఁ జేయుచుఁ దీసికొనివచ్చిరి. "వీనితో నెక్కుడిపోర"ని దండముతోఁ గూడ నేను "లోఁబడితి"నని సాగిలపడి నమస్కరించితిని. అంత నా చేసినపుణ్యమున నాయసుర సంయమనివిడిచిపోయె. పోవుచు "రాక్షసునొక్కని నేనినరకమున వైచిన నిన్నును నీసంయమనీపురమును నాశనముచేసెద"నని చెప్పెను. ఆదినముసుండియు వానిపేరుజ్ఞప్తికివచ్చునపుడెల్లఁ బాశదండములతోఁ గూడ నేనువడఁకుచుందును.

విష్ణు:— ఆరావణునిదుండగములు మేరమీఱుచున్నవే? చెడుకాలముదాపురించినప్పుడిట్టిబుద్ధులు పుట్టుచుందును.

వాయు:— దేవా! యారాక్షసహతకుఁడు తీఱికయున్నప్పుడెప్పుడో యొకమారీయింద్రాదులపైకివచ్చునేగాని నా విషయమునన ట్లుగాదు. దినమున నఱువదిగడియలును వానివలన నాకుఁదీరనిబాధయే!

మ॥ గరుడవ్యాళమనుష్యకిన్నరవరుల్ ♦ గంధర్వులున్ దేవతల్
నిరతంబున్ హృదయంబులన్ నిలుపుచున్ ♦ నిండారమన్నించు పు
ణ్యరతాత్మున్ ననుఁ జేయికాల్విఱిచిన ♦ ట్లా దైత్యనాథుండు త
త్పురిలోఁ ద్రోసియు నీచకార్యములు నా ♦ తో నెప్డు చేయించెడున్.

ఆపాడురావణుఁడు ప్రభుత్వమునకు వచ్చిననాఁటనుండియు నాకీపాట్లే. లంకాద్వీపమునందలి వీధులను సందులను గొందులను నిచ్చటచ్చటననేల యెల్లచోట్లను సంచరించి పరిశుభ్రముచేయవలెనని కట్టడచేసియున్నాఁడు. జగత్ప్రాణుఁడను గావున నభిమానమునఁ జతుర్దశలోకోపయోగమునకై యొక్కయంశము మిగిలించుకొని తక్కినయంశములతో నేనొకనిమిషమైన విశ్రాంతిలేక లంకాస్థానమును శుభ్రపరచుచున్నాను. లంకాద్వీపము నాకు నిర్బంధకారాగారమైనది.

సీ॥ గంగాతరంగశీ ♦ కరములచే శీత
లమ్మైన సికతాత ♦ లమ్ములందు,
నందనమున హరి ♦ చందనమందార
సంతానకల్పక ♦ చ్ఛాయలందు,
రాకానిశల నిర్జ ♦ రస్త్రీలువిహరించు
కనకసౌధాగ్రభా ♦ గములయందు,
సామగానము చిత్త ♦ సమ్మోహనముగా జ
రగుదివ్యతాపసా ♦ శ్రమములందు,
తే॥గీ॥ నాఁడుమొదలుగ దేవ! యీ ♦ నాఁడు నీస
మీపమున మొఱలిడు నీని ♦ మేషమునఱ
కొక్కమారైన విహరించి ♦ యుండలేదు;
కసవుఁజిమ్ముచుఁ గాలంబు ♦ గడపవలసె.

అధమరాక్షసుఁడొకఁడు నాథుఁడై శిరమునఁనెక్కి క్షణమైన వ్యవధి గలుగనీయక బాధించుచుండ నేనిట్లు తాళియుందును?. అయ్యో! వాఁడుపెట్టుబాధలనుఁ గూడ నేనంతగఁ జింతింపను. కాని,

ఉ॥ నీపరమాదరమ్మున న ♦ నింద్యయశంబును గౌరవంబు నెం
తో పటిమంబు గల్గఁగఁ జ ♦ తుర్దశలోకములన్ జరించి యే
పాపము లేని నాకకట! ♦ పంకజలోచన! నేటికిట్టులీ
చీపురుఁబట్టి పెంటలను ♦ జిమ్మెడువృత్తి ఘటిల్లెనేమనన్?.

విష్ణు:—పవనా! నీవిషయమందుకన్నను దుఃఖాకరము. నిన్నుఁజూచిన జాలియగుచున్నది.

దేవతలు:—దేవా! యింతవఱకు నీవు చిత్తగించినవి మానాయకులైనదిక్పాలురు పడిన బాధలు. ఆరావణుని క్రూరభటులు మమ్ము గాసిఁబెట్టువిధము వివరించిన నెన్నిగ్రంథములోయగును.

సీ॥ ఒకమారు మాతంగ ♦ యూథంబులం దెక్కు
పగిది మాపై నెక్కి ♦ స్వారిచేతు
రొకమారు మముఁబట్టి ♦ యుత్తమాంగంబుల
కుంతలంబుల నెల్లఁ ♦ గొఱిగివైతు
రొకమారు మొగముల ♦ నుంచిన నామాల
నాలుకలను నాచి ♦ నాకుచుందు
రొకమారు తలపాగ ♦ లూడిపడంగ ను
గుంజులయి మామెడలపై గుద్దుచుందు
తే॥గీ॥ రేమి చెప్పుదు మేమింక ♦ నేది చేయ
రానిపని దానిఁ జేయక ♦ మానరెవుడు;
ప్రాణములు మేము వీడనే ♦ రమిని నెట్లొ
బ్రతికియుంటిమి జీవచ్ఛ ♦ వములమగుచు.

విష్ణు:—ఓ దేవతానివహములారా! యా పౌలస్త్యునిచే మీరుపడెడుబాధలవిన నామనంబెరియుచున్నది. అచిరకాలమున మీకు దానవబాధఁ దొలఁగింపఁ బ్రయత్నించెద. కమలాసనా! యీ దేవతలు పలికిన తెఱంగెఱింగితివిగదా! రావణుఁడు విశ్రవసునాత్మజుఁడగుట నీకు మనుమండగు. వానిశిక్షించిన నీమనస్సునకాయాసము గలుగునేమోయని నాకు విచారము గలుగుచున్నది. ఎట్లైన వానిశిక్షింపక తప్పదు.

బ్రహ్మ:— నీ వింతయు విచారమునొందఁ బనిలేదు.

తే. గీ. తెగఁ జెడిన యంగకమును ఛే • దింపకున్న
శేషమే యది యొడలెల్లఁ • జెఱచునట్లు
దుర్జనుని బట్టి సమయానఁ • దునుమకున్నఁ
దడవుగా వాఁడు లోకమం • తయునుఁ జెఱచు.

గుణములేనివాఁడు కొడుకైనను మనుమఁడైనను క్షమింపఁగూడదు. చందనవనమునఁ దుమ్మచెట్టువలె నారావణుఁడు మా పవిత్రవంశమునఁ జెడఁబుట్టియున్నాఁడు. అట్టిదుర్మార్గుని నీవెకాదెవ్వరు వధముట్టించినను నాకుఁ బరమసంతోషము. మఱియొక విశేషాంశము నాకరిగింపుము.

చ. "దనుజతతిన్ సృజించుచుఁ బ • దంపడి వారు తపంబు సేయఁ బె
ల్చనమితిలేని బల్వరము • లన్ దయచేసి జగంబు బాధలన్
మునుఁగఁగఁ జేయు బ్రహ్మ" యని • పూర్వమునుండియు నాకు బేరువ
చ్చె; నదియుఁ బోవుటెట్లనిక్ర • శించుచునుందు మనంబులోపలన్.

"పరమేష్ఠి యగు బ్రహ్మ దుర్మార్గరాక్షసులను సృజించుచు వారు తపంబు సేయఁగా మితిలేని వరంబులొసఁగి జగత్క్షోభమున కవకాశము గలిగించుచుండు" నని లోకమున నాకుఁ బెద్దయపకీర్తిగలదు. ఆదుర్యశముఁ బోఁగొట్టుకొనఁ జాలక చింతించుచున్నాను. అదేమి పాపమో కాని రాక్షసులలో నూటికిఁ దొంబదితొమ్మిదిమంది నన్ను, నీశ్వరుని విడిచి సులభసాధ్యుఁడనని కాఁబోలు వచ్చి నాపాదములు పట్టుదురు. పోనిమ్మని వరములిచ్చిన నంతటితో నుండక త్రైలోక్యభువనక్షోభము గావింతురు. తొల్లి హిరణ్యాక్షహిరణ్యకశిపులు పెక్కుకాలము లోకములబాధించిరి. ఇప్పుడీరావణుఁడు వారిస్థానము నాక్రమించియున్నాఁడు. ఇట్టి ఖలులను దండించుట మనకు ముఖ్యకర్తవ్యము. కావున నవశ్యమతనిఁ దెగటార్చి దేవతలకును మునులకును సేమముఁ గూర్పుము.

విష్ణు:— పరమేష్ఠీ! నీయభిప్రాయము కేవలము శ్రేష్ఠము. నీహృదయ మత్యంతసరళము. నీవనినట్లు ధర్మరక్షణము మనకుఁ బ్రధానము. రాక్షసవధమునకుఁ బూనుకొనవలసినదే. వారలు దుష్బుద్ధి విడువనప్పుడు మనమేమి చేయఁగలము? ఓ, దేవతాప్రముఖులారా!

క॥ వినుఁడీ! దశరథునకు నం
దనుల మదీయాంశయుతుల • నలువుర నిదెనే
జనియింపఁజేతు, వారుభు
వనము నదానవమొనర్తురు • పటుబలయుతులై.

ఇంద్ర.—నీవుతలఁచినఁ గార్యసిద్ధికిఁ గొదవయుండదు. ఇకమేమందఱము రొమ్మునఁజేయియుంచుకొని నిద్రింపవచ్చును.

విష్ణు—గీర్వాణులారా! యిక మనమన హవిర్భాగములఁగొని మన నివాసములకరుగవచ్చును.

బ్రహ్మ—అట్లేచేయుదము.

[దేవతలు నిష్క్రమించుచున్నారు.]

ఋశ్య—దశరథన్నృపాలా! దేవతలెల్లఁ దమతమహవిర్భాగంబుల గ్రహించి దివమున కేఁగిరి.

ఉ॥ ఓనరపాలచంద్రమ! శు • భోజ్జ్వలమీవరపాయసంబువై
శ్వానరుఁడిచ్చె; నీదుకుల • భామలకున్ దగఁబంచిపెట్టుమా!
దీనిమహామహత్త్వమున • ధీరగుణుల్ రణరంగకోవిదుల్
సూనులు నీకుఁ గల్గుదురు • సున్ను త్రివిక్రమవిక్రమక్రముల్.

ప్రాజాపత్యపురుషుఁడీపాయసము ననుగ్రహించి యున్నాఁడు. ఇష్టిపరిపూర్తి యైనది.

దశ—మహాప్రసాదము. ఓకాంతామణులారా! యిటురండు.

తే॥గీ॥ ఋశ్యశృంగులు మనపైనఁ • గృపవహించి
మనకుఁగాఁ బుత్రకామేష్టి • నొనరఁజేసెఁ
దానఁబరితృప్తినొంది వై • శ్వానరుండు
చాలదయనిచ్చె నీపాయ • సంబుమనకు.

నేనీపాయసము మీకుసమముగాఁ బంచిపెట్టెద. గ్రహింపుఁడు.

[ఇచ్చుచున్నాఁడు.]

కౌసల్యాకైకలు—మహాప్రసాదము. [తీసికొని కన్నులకద్దుకొనుచున్నారు]

దశ — సుమిత్రను విడిచిపెట్టితినే. పాయసము లభించిన సంతోషముతో నాకు భార్యలు మువ్వురను సంగతియుఁగూడ మఱచితి.

కౌసల్య — దీనికై చింతింపనేల? ఇప్పుడేమి మించినది! నాకు మీరిచ్చిన పాయసమున నొకకొంత సుమిత్రకిచ్చెదను.

కైక — నేను నొకభాగమిచ్చెదను. ఆమెయు గ్రహింపవలసినదేగదా.

దశ — అవునట్లుచేయుఁడు. నాపొరపాటును మీరుసవరింపుఁడు.

కౌసల్యాకైకలు — సుమిత్రా! యిదె తీసికొనుము (ఇచ్చుచున్నారు)

సుమిత్ర — భాగ్యము. [గ్రహించుచున్నది]

దశ: — సుమిత్రా! నీకే యెక్కుడుభాగము లభించినది.

సుమి: — నీవంటి ప్రాణనాయకుఁడును గౌసల్యాకైకలవంటి సోదరీమణులునుండ నాకేకొఱంతయైన నేలకల్గును? మీయందఱకు నాపైఁగల కూర్మియట్టిది.

దశ — మీరుముగ్వురు తృప్తినొందిన నాకదియే సంతోషము. (మునులతో) మహాత్ములారా! నాయందనుగ్రహముంచి కార్యము నెఱవేర్చితిరి.

ఋశ్య — నీమనసు మంచిదగుటచే సర్వము నిర్విఘ్నముగఁ గొనసాగినది. ఇక మాయాశ్రమములకుఁ బోయెదము.

వసి: — దశరథా! మీరందఱు భోజనము లొనరింప నేఁగుఁడు.

దశ — చిత్తము.

(అందఱును నిష్క్రమించుచున్నారు)

ప్రథమాంకము.



గనఁబడుచు లోలోన సోదరులఁ బ్రోత్సహించి యొరులకుఁగీడు సేయిం
చుచుండును. కానిమ్ము. కాలమిట్లేయుండదు. నేను పగఁదీర్చుకొన
లేకపోను.

ధవ—రాముఁడుమాత్రము కాపట్యమెఱుంగునా? ఎట్లున్నను వారు మహారాజపు
త్రులు. మనము వారినాశ్రయించి కాలముఁగడపుకొన వలసినవారము.
వారితో మనము విరోధించరాదు.

మంథ—ధవళా! నాకుఁ గలిగిననొప్పి నీకుఁగలిగియుండిన నిట్లనియుండవు. ఒరుల
కు నొప్పిగలిగినపుడు నేనుగూడ పరమశాంతముతో నుండఁగలను, ఎట్ల
యిన రాముఁడు ప్రోత్సహించుటయు లక్ష్మణుఁడు తన్నుటయు మాత్రి
ము మఱపునకు రావు. అంతయో యింతయో విద్య నభ్యసించి నలుగుర
లోఁ దిరుగ నేర్చిన రాముఁడా యిట్లు వర్తింపవలసినది?. అందునను
దానుబుట్టుటకుఁ బూర్వమే యింటఁజేరియుండిననన్నుఁ దనజననీజనకుల
సేవించుచుండిననన్ను శైశవమునుండి తన్నెత్తిపెంచిననన్నుఁ బరిచారిక
నైనన్ను నబలనైనన్ను నన్నాతఁడిట్లు తన్నింపవలసినది?. ఆఱుమాస
ములు సాముచేసి యవ్వాపై నెత్తివచ్చినట్లున్నది. ధవళా! నేనందఱు
పరిచారికలవంటి దానను గాను. మంచికివచ్చినఁ బ్రాణముసైన నిచ్చు
దానను. విరోధించిచలపట్టినఁ బ్రాణముఁగొనువఱకు వదలఁబోనిదాన
ను. దేవుఁడిచ్చిన యాయువు గట్టిగానుండవలెఁగాని యారాముని మూ
డుచెఱువులనీరు ద్రావించెదఁ జూడుము. నేను దాసిననికదా? అయి
ననేమి! నాకుఁగలగౌరవము నాకుఁగలదు. మహారాజకుమారుఁడని రా
ముఁడు నన్నుఁబరిభవించుట తగదు. ప్రపంచమున నెవ్వరును శక్తిహీను
లుండరు. పనికిమాలిన యగ్నికణము పట్టణములఁగాల్చును. ఏమఱిన
ప్పుడెలుక సింహమును గఱచును. గాలిలోఁ దేలియాడు దోమ భద్రగ
జంబును గీఁపెట్టఁజేయును. రామునిపైఁ బగఁదీర్చుకొనుటయనిన నావం
టి బుద్ధిశాలినికెంతపని?.

ధవ—అమ్మా! నీవెంతటికైన సమర్థురాలవు. అంతిపురములో నీకుఁ బలుకుబడియు
మిక్కుటముగఁ గలదు. నందినిబందిని బందినినందిని జేయఁగలవు. నీమాట
కెదురాడఁజాలను.

మంథ—అయ్యో! నీవు నోటవ్రేలిడినఁ గఱవలేనివాఁడవు. నేను గయ్యాళిని.
ఉన్నమాట చెప్పినందునఁగదా యిట్లనఁగలిగితివి. కాలము ప్రతికూల

ముగ నున్నప్పుడే యందఱును శత్రులగుదురు. ముందుగఁ గౌసల్యకు నా కు నష్టమచంద్రుఁడు నైధనతార. ఇప్పుడు నాకును దానికో యుప్పునకును గ స్త్రైకును నిప్పునకును గలమైత్రి. లక్ష్మణుఁడు నాకుఁ జుక్కయెదురు. కౌసల్య పట్టమహిషి యగుటచే దానిదాసీజనమంతయు నాకు విరోధమే. నీమాట యిప్పుడు వెలియుచునేయున్నది. ఎందఱెట్లున్న నేమి? నేను భయపడు దానఁగాను. బలవంతులగు శత్రువుల నుపాయముతో నిర్జింపవలెను. సరి యిప్పుడు నీతో నింతకన్న నెక్కుడుగ మాటాడుటకు వ్యవధిలేదు. వైద్యుని గృహమును జేరవచ్చితిని. ఇంతకు నీవెక్కడికి వెళ్ళుచుంటివో యడుగ మఱచితిని.

దాసి—మహారాజుగారు సుమంత్రుని దోడ్తెమ్మనిన వెళ్ళుచున్నాను.

మంథ—అట్లయిన వెళ్ళుము. నేనును బోయెద. (పోవుచున్నది)

దాసి—పరనిందావిషయమున మంథరను జెప్పినపిదప మఱెవ్వరినైనఁ జెప్పవలెను. [పరికించిచూచి] మందరపర్వతము మోచి విష్ణుమూర్తికిఁ గూర్మావతారమున గూనువచ్చినట్లు మంథర కిపుడు గూనువచ్చినది. ఇది యలంకారవిశేషమై యామె సహజసౌందర్యమునకు వన్నెఁగూర్చుచున్నది. ఇదె సుమంత్రు నిల్లు. ఇతనిఁబిలిచికొని యాస్థానమునకరిగెద. (నిష్క్రమించుచున్నాఁడు)

ఇది విష్కంభము.

## దశరథు నాస్థానము.

(వసిష్ఠ దశరథ సుమంత్రులుందురు.)

దశ—సుమంత్రా! కుమారుల విద్యాభ్యాసము గుఱించి తెలిసికొనెదనంటివే! ఏమి చేసితివి?

సుమం—తెలిసికొనియున్నాను. దేవరతనూజులు నలువురును సకల శాస్త్రములను గళలను నిపుణముగ నేర్చి విద్యాపూజ్యులయియున్నారట. విద్యతోఁ గూడ వినయమును వారినాశ్రయించినది. మఱి ధనుర్విద్యయెడ,

మ॥ శరముల్ తూణమునుండి గైకొనుటయున్ • జాపంబునన్ గూర్చుటల్
త్వరతోడన్ దెగవాపుచేయుటయునన్ • భాసిల్లుకార్యంబులన్
గరమున్ బొందితిగల్గి యోదశరథ • క్ష్మానాథ! నీసూనులు
ద్ధురధానుష్కశిరోవతంసులనియెం • తో కీర్తిఁగాంతుర్ సుమీ!

వసి — నీకుమారులుజ్జ్వలగుణోపేతులెట్లుగాకుందురు? పులికడుపున మేకలుపుట్టునా? కుమారులు లోకైకకార్యకోవిదులై నీకును నీవంశమునకును గీర్తిని గింతురు.

దశ — ఇదియంతయు నీయాశీఃప్రభావము. ఎన్నిసౌఖ్యసంతానములున్నను కొంతవాయని నాకు సంతానసౌఖ్యముఁ గలిగించి ధన్యునిఁ జేసితివి. సుమంత్రా! నీవు శ్రద్ధాళుఁడవై యప్పుడప్పుడు కుమారుల విద్యావిషయముఁ గూర్చి తెలిసికొనుచుంటివి.

సుమం — నేను చేయవలసిన ధర్మమునే చేసితిని. దేవా! యవధరింపుఁడు.

మ॥ వరవిద్యావిభవంబునందును ధనుః • పాండిత్యమందెందు నం
దఱు బేర్వాసిసినిగాంత్రతుంగాని ప్రతిభా • దార్ఢ్యంబునన్ విక్రమో
ద్గరతిన్ జూడఁగ రామలక్ష్మణులె య • గ్రస్థానమున్ జెంది యె
ల్లరచే మెప్పునుగాంచువారట నృపా • లశ్రేష్ఠ! నీపుత్రులన్

వసి — సుమిత్రాసుతులిరువురలో నొకఁడు రామచంద్రునకును మఱియొకఁడు భరతునకును గూర్చువారలై యన్యోన్యమైత్రిచే నొప్పుచుందురు.

తే॥గీ॥ తమకిడిన పాయసమును భా • గములుచేసి
కైక కౌసల్య యిచ్చిన • కతననేమొ
యొకఁడు కౌసల్యకొడుకు నిం • కొకఁడు కైక
కొడుకువెంటనుండ్రు సుమిత్ర • కొడుకులెపుడు

వసి — అవునెప్పుడేని రామలక్ష్మణులొకటిగ విహరించుచుందురు. భరతశత్రుఘ్నులొకరినొకరెడఁబాయరు. దశరథా! నీతనయులలో, విద్యాబలముననేమి గుణసౌష్ఠవముననేమి సత్యశాస్త్రములనేమి రామచంద్రుఁడు పూర్వాధికుఁడై యుండును. అతఁడిక్ష్వాకుకులమునకు నిరుపమానకీర్తిఁ దేఁగలడు. రామునివలన నీవు ధన్యుఁడవయ్యెదవు.

క॥ రవివంశవర్ధనుని రా
జవరేణ్యునిఁ బుణ్యమూర్తి • సజ్జనగణబం
ధువుఁ గీర్తిప్రియు దశరథుఁ
బ్రవిమలగుణుఁ జూచిపోవ • రాక మహాత్మా!.

నినుదర్శించుకొని యిక్ష్వాకుకులప్రదీపకుఁడగు దశరథుని జూచుటకన్నఁ గార్యమే మియులేదు.

వశి — అట్టియైన దశరథుఁడు ధన్యుఁడు. మంచిపనిచేసితివి.

దశ — లోకపావనుఁడవగు నీవు దర్శనమొసఁగుట నాపుణ్యము పండినట్లు. నీపాదారాధన తత్పరబుద్ధినగు నేను నీవు పనివంచినఁ బనిఁజేయ సిద్ధముగనున్నాను. నీకిష్టమేదియో కోరుము. సమకూర్చెద.

విశ్వా — దశరథా! నీవు కాకుత్స్థకులమణిమయాలంకారుఁడవు. ఆడితప్పనివాఁడవు. సజ్జనప్రియుఁడవు. నావచ్చినకార్యము నీవు ఘటింతువని నాసంతోషమునకు మేరయుండదు. నేవచ్చినపని తెలిపెదవినుము.

క॥ చలమును బలమును గర్వము
నలరెడు సుందోపసుందు • లను సహజులసూ
నులు మారీచసుబాహులు
గలరిపుడు దైత్యు లధిక • గర్వితచిత్తుల్.

ఈమారీచుఁడు లంకారాజ్యమునేలు రావణునిమంత్రి. ఎచ్చట నేసవనము జరుగుచున్నను దుర్మదాంధులగు మారీచసుబాహులువచ్చి చేయరానికార్యముల నాచరించిమునీంద్రుల క్రతువిధ్వంసముఁ గావించుచుందురు. ఎట్లుతెలిసికొందురో కాని సవనమొనరింపఁ దలపెట్టినప్పుడంతయుఁ [illegible] సూటిగా సమయమునకువచ్చెదరు. అబ్బ! యానీచులుచేయు కార్యములిట్టివని వచింపఁజాలను.

సీ. కుంభవర్షముగాఁగ ♦ గుఱియు క్రూరరక్తంబు
సవనాగ్నిహోత్రంబు ♦ చల్లపడఁగఁ
బలితంబులైనయ ♦ మ్మునులు రువ్వెదురు యాజ
కులతలల్ పగిలి వ్ర ♦ య్యలయికూలఁ
బాములఁ దేళ్ళఁ గు ♦ ప్పలుగుప్పలుగ వైతు
రటనున్నమునులంద ♦ అపలిపాటః
మలమూత్రముల శిరం ♦ బులవిడుతురు "చాలు
వదరోరి క్రతువం"చుఁ ♦ బరువులెత్త:

తే.గీ. నదియుదని చెప్పనేల? వే ♦ యంగరాని
వన్ని వేసియుఁ జేయరా ♦ నట్టివన్ని
చేసి పంతంబుఁజెల్లింతు ♦ చేయిజారి
పడినకడవన్లు సవనంబు ♦ భంగ మొందె.

ఇట్టికష్టములకుఁబాలై బహుసంవత్సరములుగ నేసవనమును మేము చేయఁజాలకున్నాము. చిరకాలసంపాదితమైన తపోబలమునకు హానియని శపింపఁజాలకున్నాము. మునులలో నింతపేరును బ్రతిష్ఠయు గలిగిన నేనా రాక్షసుల వలనిభయమున నెంతకాలము క్రతువులొనరింపక యుండనేర్తును? ఇప్పుడెట్లయిన నొకక్రతువు నొనరింపవలెనని కొందఱు మునులును నేనును నిశ్చయించుకొంటిమి. ఆక్రతువు నిర్విఘ్నముగఁ గొనసాగుటకు నీవంటిరాజుల సాయమవసరము. అట్టిసాయమునకే యిప్పుడు నిన్నుసమీపించినది. సామాన్యభూపతుల కా దైత్యుల వారించుటకు శక్తిచాలదు. కావున,

క. భూమీశ్వర! భూరిబలో
ద్దాముని భువనైకకీర్తి ♦ ధాముని జలద
శ్యాముని రవివంశాంబుధి
సోముని బంపింపు రాము ♦ సుగుణస్తోమున్.

అతఁడు తప్పక క్రతుసంరక్షణము చేయఁగలఁడని నానమ్మకము. నీవొండువిధమునఁదలఁపక రామచంద్రుని నావెంటఁబంపుము.

దశ — [స్వ] ఆహా! నేను నిదురించుచు స్వప్నముననున్నానా? మేలుకొనియున్నా

నా? ఈవిశ్వామిత్రుఁడు రామచంద్రునా తనవెంటఁ బంపఁగోరుచున్నాఁడు? ఈపలుకులు వజ్రఁపుఁదెబ్బలవలె నొప్పినిఁ గలిగించుచున్నవి. (ప్రకాశము) ఓవిశ్వామిత్రమునీంద్రా! యిదియేమో విపరీతము. దురాత్ములగు రాక్షసులతోడి యుద్ధమునకా రామచంద్రుని నీవు పంపుమనుచున్నావు? రాముఁడెక్కడ? లోకభైరవాకారులగు దైత్యులెక్కడ? నీక్రతుసంరక్షణమెక్కడ? అక్కటా!

చ॥ అరుణరసాలపల్లవము • నట్టులు మెత్తనిమేను; వాఁడియౌ
శరముధరింపలేఁడు; రణ • చాతురియించుకలేదు; ప్రాయమో
చిఱుతదనంబు; మించి యొక • చెంపను బాలు మఱొక్క చెంపనె
త్తురు గలగోల; రాము నెటు • ధూర్తులపై బనుపంగ నేర్చెదన్?

మునీంద్రా! శిరీషపుష్పమున కన్నను రాముని మేను కోమలము. వయస్సు పదునైదు సంవత్సరములు. పచ్చిపురిటిసెని పసికాటుపెట్టఁజాలని హరిణశాబకమువకన్న ముగ్ధహృదయుఁడు. అంతఃపురములోఁ దనతల్లి కౌసల్యయొద్దనైన నిశ్చయముగ మెలఁగనేరని నెఱసిగ్గరి. ఒకపలుకు కఠినముగఁబల్కిన శతపత్రపత్రనేత్రములను విశాలనేత్రములనిండ బాష్పములు గ్రమ్మఁకొనెడి భీతచిత్తుఁడు. ఇట్టిరాముని యాతుధానులపై నెట్లుపంపనగును?

తే॥గీ॥ జగము నుమ్రింగు దుష్టరా • క్షసులపైకిఁ
బరమసుకుమారు రాముని • బంపుటెల్ల
నపరిపెనుమంటలెగయు దా • వాగ్నినొప్ప
పేతనును వెన్నముద్ద వ్రే • ల్చినటుగాదె?

శా॥ మారీచుండుసుబాహుఁడీస్వైరమహా • మాయావులున్ విక్రమో
దారుల్ ధీరులు; చేరికిం గొనరు సు • త్రామాదులన్; వారిపై
బోరన్ బోవుట మృత్యుదేవతగృహంబున్ • జేరఁగాఁబోవుటే
యౌరా! రాముఁడెటువారినోర్చెడి? నెటుల్ • ప్రాణాలతో వచ్చెడిన్?

# ద్వితీయాంకము.

మారీచసుబాహులు బలవంతులలో బలవంతులు. దురాత్ములలో దురాత్ములు. ఆ కరసమరరంగముల ననేకవిద్యుచ్చర సమూహములఁ బాఱఁదోలి పేరుగాంచిన దిట్టలు. కామరూపధరులు. లోకమున నెందైన నిరుపరాధులఁ దమ్ములు దురాత్ములై జనులకుఁ గీడొనరించుచున్న నిమారీచసుబాహుల దృష్టాంతముగఁగొని వారి నిమారీచ పేరులఁ బిలుచుచుందురు. అట్టి లోకసంత్రాసకర మర్కటవ్రాత మహాసాహసుల సామాన్యులు లేరి మాడ సాధ్యమా?

చ॥ గుడులను గోపురంబులను • గొబ్బున గ్రమ్మింగెడు వార్క్రమోల లిం
గఁడొకఁడు నిల్వఁజాలుటలు • గల్గునె? దుర్దమసాహసాంకుల
న్బిడుగులవంటివారి రజ • నీచరధీకుల రామచంద్రుఁడే
వడుఁవున నోర్వనేర్చు? ముని • వంశవిభూషణ! వానిమానుమా!.

జగత్సంహారముఁ గావింపఁగల యాదుర్దాంత రాక్షసుల నెదిరి రాముఁడు ప్రాణ వేఁటుగతిపట్టుట తప్ప నీజన్నంబు పరిసమాప్తి నొందఁజాలదు. నీవు నవన ము చెడును. నాకుఁ బుత్రుఁడు చెడును. కావునవోమునీంద్రా!

చ॥ చతురంగధ్వజినీపతుల్ గొలువఁగా • శాతాస్త్రముల్ బూని మహో
నితశక్తిల్ మోదమునొంద దైత్యుఁడొకఁడే • నిన్ జేరరాకుండ నీ
క్రతువుల్ గాచెద వజ్రభాస్వర తను • త్రాణంబునై నిన్నుఁగొ
ల్చి; తపస్విప్రవరా! మదాత్మజునిఁగా • క్షింపంగఁబోకి యెయ్యెడన్.

నీవెంతసైన్యముఁ గావలెనన్నఁ బెట్టెదను. ఎన్నిదినములుండుమన్న నుండెదను. ఏపని జేయుమన్నఁ జేయుదును. నీయాశ్రమమును సదాసహస్రనేత్రములతోఁ గాచియుండెదను. అంతటితోఁ దృప్తినొందుము. నీకోరిక నెట్లయినఁ దీర్చెదము వదలిపెట్టుము. రాముని విడుము. నన్నుఁ గాంచుము.

విశ్వా — దశరథా! వేసేలున్నది? గా భయమునుఁ బెంచుకొనుచుంటివి? పెద్దకాలమునకుఁ బుత్రులఁబడయుటఁ జేసి నీవట్లు శంకించుచున్నావు. రాముని పరాక్రమాగులు నీమనస్సునకుఁ బట్టలేదు. వయస్సునఁ జిన్నవాఁడేకాని విక్రమ సాహసములఁ బెద్దవాఁడు రాముఁడు.

ఉ॥ బాలుఁడటంచుఁ బల్కెదు భ ♦ వత్సుతు రాముఁ; నతండు రాక్షసుల్
వేలును నూర్లుఁగాదు పది ♦ వేలును లక్షలుఁ గోట్లు వచ్చిన
న్గాలుపఁ జాలు నుద్భటధ ♦ నుర్ధరుఁ డాతఁ డొకింత యల్గిన
జ్వాలుగ సర్వలోకములు ♦ నాశము నొందు నిమేషమాత్రలో.

మ॥ ఒకమారీచసుబాహులేల? ధరయం ♦ దున్నట్టి గీర్వాణ దై
త్యకదంబంబులు సర్వమున్ గదలి డా ♦ యన్ వచ్చినన్ రామచం
ద్రుకడన్ సన్నని యొక్క బాణమునకున్ ♦ దూగంగలేరట్టి శౌ
ర్యకఠోరున్ బనుపంగఁ జింతిలుట న్యా ♦ య్యంబే నృపాలోత్తమా!.

దేవదానవసమూహములొక్కటైవచ్చినను రాముని యొంటిపై రేఖయైనఁ బడదు. నీవు చతురంగబలములతోఁగాదు శతసహస్రాంగ బలములతో వచ్చినను మారీచసుబాహుల వారింపఁజాలవు. కడకు వారియెదుట నిలువనైనఁజాలవు నిన్ను నమ్మి క్రతువు నారంభించి మునిపుంగవులును నేనును వ్యధావమానములపాలు గావలసివచ్చును. కావున నీవు సహాయుఁడవై వచ్చెదనన్నను నాకు సంతోషముకాదు. ఆవశ్యకమునుగాదు. రాముఁ డొక్కనిఁ బంపిన నాకన్ని సాహాయ్యములు జేసినట్లగును.

చ॥ గురుఁడు వసిష్ఠుఁ డాతనియ ♦ కుంఠితశౌర్యము మెఱుంగు; రాముఁడ
త్యురుతరసాహసుండు; క్రతు ♦ వొప్పఁగ రక్షణసేయు; నెల్లని
ర్జరులమృతంబుఁ గాచునటు ♦ సంయములందఱు నేను గాచి భూ
వర! పువులందుఁ బెట్టికొని ♦ వచ్చెద నిచ్చెద నీకుమారకున్.

రాముని శౌర్యసాహసములఁగూర్చి మహాత్ముఁడు వసిష్ఠుఁడు నీకు బోధింపఁగలఁడు. నీకుమారుని నేమమునఁ దెచ్చి మఱల నీయొద్దనిలిపెద. మఱుమాటఁబలుకక యతనిని నావెంటఁబంపుము.

దశ—అయ్యో! మునీంద్రా! రాముని గోరుట మానవే!. నను మన్నించి నా విన్నపము నాలకింపుము.

కం॥ తొలి దేవాసుర యుద్ధం
బుల ముక్కోకలనుఁ దీఱ్చి ♦ పొగడొందిన నే
నల మారీచసుబాహులఁ
దలఁచి వెఱతు; రాముఁ డెట్లు ♦ దర్పముఁ జూపున్?.

అయ్యో! ఏమని యెట్లు పంపుదును? ఏకార్యమైనఁ జేసెడు వానికైన సమాధానముగ నుండవలదా? అకటా! తండ్రినగు నేనింటఁ జత్రాయివలె గూర్చుండి యకృతుని దుర్వార దైత్యులపై ననికనుపుట న్యాయమగునా?.

చ॥ అఱువది యేండ్లనుండి తని ♦ యన్ మహిఁ బాలన సేసి భోగభా
గ్యరతులు గష్ట సౌఖ్యములు ♦ గన్గొని కాటికిఁ గాళ్లు జాఁచుచున్
జరను గ్రహించు నేనకట! ♦ చల్లఁగ నింటను గూరుచుండి యే
మెఱుఁగని రాముఁ బంపిన ము ♦ నీశ్వర! లోకము నన్ను దూరదే?.

ఎంతదూరమాలోచించినను నీయానతి నెంతత్రోయరానిదని భావించి యొనరిం పఁ బ్రయత్నించినను నామనస్సునకు ధైర్యము దొఱకకున్నది.

సీ॥ ఎన్నొనోములు నోఁచి ♦ యెన్నొయాత్రలకేఁగి
యెన్నొతీర్థములాడి ♦ యెన్నొ చేసి
పడరాని పాట్లెల్లఁ ♦ బడి కుడువఁగరాని
కష్టంబులఁ గుడిచి ♦ కడకుఁ బుత్ర
కామేష్టి నొనరించి ♦ కౌసల్య నేను న
భాగ్యులు భాగ్యంబుఁ ♦ బడయునట్లు
పడసితి మీసుతుఁ ♦ బరమసద్గుణధాము
సూర్యవంశాంబుధి ♦ సోము రాము

తే॥గీ॥ నట్టివాని రక్కసులపై ♦ నెట్టుపనుతుఁ?
నీయయోధ్య నొంటరిగ నే ♦ నెట్టులుందు?
నీమొదలఁ బ్రాణమింక నే ♦ నెటుభరింతు!
వదలుమీకోర్కి; నీకు మ్రొ ♦ క్కెద మునీంద్ర!.

రాయైనచెల్లి దేవునిగను నాకైనచెల్లిఁ బత్రిగను దలంచి పూజచేసి తీవ్రరోగార్తుఁ
డమృతముఁ బడయునట్లు నేనీరామునిఁ బడసితిని. ఇతఁడు నాకన్నులకు
వెలుఁగు. నాయాత్మకు శాంతి. నాభవమునకుఁ దారకము. పురుషసూక్త
మొందిన నాపాలిఁటికి పూర్వపుణ్యము. నాప్రాణమునకుఁ బ్రాణము.

సీ॥ కనులార నతనిమో ♦ మును జూచుటయు వీను
లలరార వానిప ♦ ల్కులు వినుటయు
మోము మోమునఁ జేర్చి ♦ ముద్దుఁబెట్టుటయును
శిర మాఘ్రాణంబు ♦ సేయుటయును
నెనటికిఁబోనీక ♦ యెత్తియుంచుటయును
నంచితగతిఁ గౌఁగ ♦ లించుటయును
"రామ! రామా!" యని ♦ ప్రేమమై పిలుచుట
చిత్తమాతనియందుఁ ♦ జేర్చుటయును

తే॥గీ॥ నివిసుమీ! నాకుఁబనులురేఁ ♦ బవలు మనసు
వీనికలవాటుపడి సుంత ♦ విడిచిచనదు;
ప్రాణమైన నిచ్చెదనయ్య! ♦ రామునొసఁగ
నయ్య! క్షమియింపుమయ్య! జో ♦ హారులయ్య!.

రామునివిడిచి నేనొక క్షణమైన నుండఁజాల. ఉన్న మనఁజాల. నేనును నాబంధు
వులును సేనాధీశులును సకలసైన్యంబులును వచ్చెదము. రాక్షసులతో యు
ద్ధముచేసెదము. చేనైన గెలిచెదము. చావకున్నఁ బడెదము. ఈమా దేహప్రా
ణములు నీయనివిగాఁ బనిచేసెదము. ఎట్టికష్టములు తటస్థించినను నీక్రతువున
కు భంగము కలుగనీయము. అదినీకిష్టముగాకున్న నిచ్చినవచ్చినంత ధనము
నడుగుము. వస్తువాహనములఁ గోరుము. రాజ్యభాగము సమర్పించెదము. ని
లిచినవాఁడను నిలిచినయట్లు సంతోషమున నొసంగెద నాప్రాణములఁ గోరినా
నుము. నాకుఁగల సర్వస్వము నడుగుము. రాముని మాత్రము కోరకుము. వా
నినెడఁబాయఁజాల. మావంశమునఁ బ్రతికించుమహాపాలు నుక్కడించిన యూదా
రకరుణాసముద్రుఁడవు. నీపదములపైఁ బడి యొత్తిచెప్పుకొనుచున్నాను. నన్ను
మన్నింపుము. నాకుఁబుత్రభిక్ష పెట్టుము.

విశ్వా — దురాత్మా! నీవనుమానముతో నాకుఁబనిలేదు. ఘనకనకవాహనాదులంగోరుటకు నేను యాచకుఁడనై రాలేదు. నీవాడితప్పని వాఁడవని తలంచితిఁగాని మిథ్యావచస్కాలివని యెఱుంగను. భానువంశజులైనవారలకైన నిట్టిసత్యముఁ బలికియుండిరే? కులక్రమాగత పవిత్రయశంబును మంటఁగలిపితివి. తుచ్ఛబుద్ధిని జూపితివి.

ఉ॥ అచ్ఛపుభక్తియున్న యటు ♦ లాదరమున్నటులుంచి నన్ను నే
యిచ్చకునీవ "కోరుమిదె యిచ్చెదఁగోరినదెల్ల" నంచు వా
క్రుచ్చియు విన్నవించుటను ♦ గోరితినక్కటులు కానిచో మదం
బెచ్చిననిన్ను నొక్కతృణ ♦ మేనియు నిమ్మని కోరియుందునే?.

"కోరుము కోరుము" అని తొలుత నొత్తిడి చేసినవాఁడవు నీవే. కోరినంత నే "మాను మను మాను మను" అని కల్లబొల్లియేడ్పులేడ్చినవాఁడవును నీవే. "నేను మారుని కేమియు నీయఁజాలను. ప్రశ్నించెట్టికొని తెచ్చెద" నని పలికితివి. కపటనాటకము ప్రదర్శించితివి. నాయానతిని నిర్భయముగ ధిక్కరించితివి. భూతలమున నెందఱు రాజులు లేరు? వారిసాహాయ్యము నభిలషించి యర్థించిన మునులెందఱు లేరు! అందఱు నీవలెమాటయిచ్చి తిరుగఁబడినారా? ఇల్లాలాజీవనాధారంబుగాఁ గొని దినదినఁ గట్టుబట్టయుఁ గనుకొనఁజాలను గాన కష్టములతో మిక్కుమాపకొనియుండెదను. నీవిచ్చినదేమిచెప్పిన ట్లు చేసిననా పుణ్యముకొనియుందునని తలంచితివికాఁబోలు.

చ॥ వినయముతో మెలంగినను ♦ బెక్కుశుభంబులు గల్గు; నున్నతి
న్గనియఁగఁజేసినన్ జగము ♦ నిల్పునె నీరయిపోకయుండునే?
మునులననీదుముంగిటను ♦ బుట్టినచెట్లా పశువ్రజంబొ యే
మనుచుఁగొనియుంటివి? లోకముల ♦ నన్నిఁటఁ ద్రిమ్మఁగదు కాలరుద్రులన్.

శా॥ అంతో యింతయొ మేలుగాఁ దగదని నీ ♦ యాపుత్రకున్ గోరఁగా
నెంతో గర్వముచూపి పంపననుచు నీ ♦ వేమాటాడవో చూడు; నా
పంతంబైనను నీకుఁ జూపఁదగు; వి ♦ శ్వామిత్రశబ్దంబు వి
న్నంతన్ నీదగుతాత లేమయిరొ నీ ♦ స్వాంతంబున న్దెంచుమా!.

మహాప్రాజ్యస్వభావుఁడనియు నాదిమసార్వభౌముఁడనియు జగజ్జనులచేఁ బొగడ్త గాంచిన నీతాత హరిశ్చంద్రచక్రవర్తిచరిత్రమునఁ దొలిపుటనెత్తిచూడుము. ఈగాధేయుఁ డెట్టి జగద్భయంకరస్వరూపముతో నందు వెలుఁగుచున్నాఁడో నీవు కనుఁగొనఁగలవు. నీమంచికాలము తొలఁగినట్లున్నది. ఎందో యూరును బేరునులేక పడియుండవలసిన నీకు మామన్నన యెట్లులభించును? నీకుమారునకు మాయంతవారుండఁగల మహాభాగ్య మెట్లుకలుగును? నక్కకు నాగలోకమా? గండుఁబిల్లికి గంగాయాత్రయా? నీవింతకును నీకుమారుని వెంటఁబంపి నాకుఁజేయు మేలేమున్నది? సకలజగంబులఁ దలక్రిందుగఁజేయనోపిన నాకొకరి సాయమేటికి? పొమ్ముపొమ్ము. నీకుమారుఁడును వలదు. నీవును వలదు. నీసాయమునువలదు. నీగుణముమాత్రము గ్రహించితిని. [లేచుచున్నాఁడు]

వసి—గాధేయా! కొంచెము నిలువుము. రామునియెడఁగల ప్రబలవాత్సల్యమునను జరాకృశుండగుటను దశరథుఁడాడిన మాటలకై నీవుకినియుట బాగుగాదు. ఇతఁడు మనహితబృందమునఁ జేరినవాఁడు. ఇతనియెడ ననుగ్రహముంచి యిటువచ్చి కూర్చుండుము. నేను కార్యము సవరించెద. [అని విశ్వామిత్రుని దెచ్చి యాసీనుఁగావించి] దశరథా! రాముఁడు పసివాఁడగుటయు బుత్రుఁడౌట నీకుఁబ్రేమాస్పదుఁడగుటయు నిశ్చయముకాని నీకింత భయపడవలసినదేమున్నది? అతఁడు సమస్తదానవసంఘములకు నజేయుఁడు. రాముని పరాక్రమవిషయమట్లుండనిమ్ము. ఈవిశ్వామిత్రమునీంద్రుఁడు త్రిమూర్తులతోఁ దులఁదూఁగఁగల మహాప్రాభవసంపన్నుఁడు. లోకములన్నియు నితని మాట కెదురాడ వోడును. వజ్రవర్మమై పెట్టనికోటయై యిమ్మహాత్ముఁడు వెంటనుండ రాముఁడు జగద్భయంకరవిక్రమమునఁ బ్రకాశించును. ఈయనఘుఁడు తనంతవచ్చి రామునిఁగోరుట యీశ్వరుఁడింటికివచ్చి భిక్షనాశించినట్లు. ఈకౌశికుఁడు రాజ్యమేలుకాలమున దైత్యవధార్థమై యనేకశస్త్రాస్త్రములసంపాదించెను. సురాసురులకెఱుకపడని బహుశస్త్రాస్త్రపరంపరలితఁడెఱుఁగును. నూతనాస్త్రముల సృజింపను బెంపను సమర్థుఁడు. క్రతురక్షణమును నెపమున రామునిఁ దోడ్కొనిపోయి సాంగోపాంగముగా ధనుర్వేదము నేర్పఁ దలఁచియున్నాఁడు. ఇట్టి మహామహిమాభిరాముఁడు రామునకాచార్యుఁడుగా లభించుట నీభాగ్యము. సూర్యవంశపుణ్యవిశేషము. ఇట్టి విశ్వామిత్రుఁడు కోరినప్పుడు "పదివేల"ని రామునిఁబంపక నిరాకరింపఁజూచుట నీకువే

అయ్యా! నీవొకపనిచేయుమన నట్లుచేయునని నేనందునా? ఇమ్మహాత్ముని ప్రాపున నొకరిద్దఱు రాక్షసులేల? సకలాసురసందోహములెదురై వచ్చినను నన్నేమియుఁజేయఁజాలవు. అగ్నిహోత్రము చుట్టునుగలవాఁడు మిడుతలప్రోవునుజూచి భయపడనేల? దివ్యాశ్రమములకువెళ్ళి తపోధనులగు మునీంద్రులను దర్శింపవలెనని నాకును మిక్కిలికోరికగలదు. కావున వేఱువిధమునఁ దలంపక నన్నుదీవించి సంతోషమునఁబంపుము. [విశ్వామిత్రునితో] దేవా! నన్ను నప్పటిలో నించుక తడవైనందుకు మాయయ్యపై గినియకుము. నీవెంటవచ్చుట నాకుఁబరమాభీష్టము.

విశ్వా—రామా! (దగ్గఱకుఁదీసికొని) నీవుకనిపించినంతనే నాకోపంబు చల్లారినది. ఆహా! నీవెంత యొప్పుఁబలుకుదువే!

రాము—అయ్యా! లక్ష్మణుఁడును నావెంటవచ్చునట్లనుమతిఁ బాలింపుము.

దశ—లక్ష్మణుఁడవశ్యము నీవెంటవచ్చుఁగాక.

చ॥ అనిమిషనాథు డీల్పడచి ♦ యయ్యమృతంబు గొనంగఁబోవు తా
ర్క్ష్యునకగు నాజయంబు రణ ♦ శూరుఁబలిన్ గెలువంగనేగు వా
మనునకునైన యావిజయ ♦ మంగళముల్ రఘురామచంద్ర! నీ
కునయి యఖండకీర్తి యొసఁ ♦ గూడును గావుత మాజగంబునన్.

కౌశికమునీంద్రా! నీకు విశేషించి విన్నవింపవలసినదిలేదు.

సీ॥ ఆవంతపాత్రైన ♦ నాఁకలిదప్పుల
కొక్కింతయోర్వఁగా ♦ నోపఁడయ్య!
యాదినుండియుఁ దన ♦ యనుఁగుఁదల్లిని క్షణం
బేనివిడి మెలంగి ♦ యెఱుఁగఁడయ్య!
యెపుడుఁగ్రిందికిదిగ ♦ నీక పెంచుటఁజేసి
యొకయింత యలమట ♦ కోర్వఁడయ్య!
కన్నలి మనమొకింత ♦ కనలెత్తుచేసినఁ
గనులనిండఁగ నీరు ♦ నినుచునయ్య!

క॥ తాటకయను దానవి యు
గ్రాటవిఁ జరియింప నితని యానతి మెయి భీ
మాటోపుఁడనై చిగురును
గోటఁ గిల్లినవిధానఁ గూల్పఁగఁ గంటిన్.

(వి. మి.— తాటకవధ యేటికిఁ?)

ఉ॥ ఈమునినాథుకూర్మి గడియించితి శస్త్రములస్త్రముల్ వినం
గా మితిలేనియట్టులు; జగన్నుతపూజ్యమునీశ్వరాశ్రమ
స్తోమము పుణ్యదేశములు జూచి ముదంబునుగంటి; బ్రహ్మవి
ద్యామహనీయసూక్ష్మముల తత్త్వమెఱుంగఁగఁగంటి గాలవా!.

ఈస్వల్పకాలములో నాజ్ఞానమెంతయో యభివృద్ధి నొందినది. ఇమ్మహాత్ముఁడు గురుఁడుగాఁ లభించుట మాసుకృతవిశేషమని మేము పలుమారు చెప్పుకొనుచుందుము.

గాల—ఈమహనీయుఁడప్రతిమానశౌర్యపారీణవరాసి. ధనుర్వేదమంతయు నితనికిఁ గరతలామలకము. ఇతఁడెఱుఁగని యస్త్రశస్త్రములీయాసేతు లోకములలో నుండవు.

రాము—అయోధ్యనుండి సిద్ధాశ్రమమునకువచ్చు మార్గమధ్యమున బలయనతిబలయను నను విద్యలు నాకునేర్పెను. వానిబలమున నాఁకలిదప్పులును శ్రమమును రాక్షసభయంబులు నుండవు. తాటకను గూల్చిన యవ్వలిదినమున ననేకశస్త్రాస్త్రముల నొసంగి వాని ప్రయోగోపసంహారక్రమములను నాకు బోధించెను. ఆశస్త్రాస్త్రాధిదేవతలు స్వస్వరూపముల నాకడ సాక్షాత్కరింప నేనవ్వాని నెల్లఁ బరిగ్రహించి సమయమొదవినపుడు పనిగొనెదనని చెప్పిపంపితిని. అరణ్యములలో ముక్కుమూసికొని జపతపములొనరించు మునీంద్రునకింతటి ధనుఃపాండిత్యమబ్బియుండుట యెంతయుఁ జిత్రముగనున్నది.

గాల—చిత్రమే. ఇమ్మహాత్ముఁడు తొలుత దైత్యవధార్థమై యనేకాస్త్రశస్త్రముల నభ్యసించియుండెనట. బ్రహ్మర్షియైనపిమ్మట మఱికొన్నిఁటిని సంపాదించెను. ధనుర్విద్యలో నిప్పుడీయనతో సమానుఁడు లేఁడు.

రాము — గాలవా! బ్రహ్మర్షియైన నీవిట్లు పలికితివే?. విశ్వామిత్రుఁడు తొలుత బ్రహ్మర్షిగాఁడా?.

గాల — నీకుఁ దెలియదా? గాధేయుఁడు మొదట రాజన్యవంశజుఁడై పెక్కువత్సరములు రాజ్యమేలి యసంఖ్యాకదైత్యుల నుక్కడంగించెను. పిదప బ్రహ్మర్షిపదంబు నభిలషించి సంపాదించెను.

రాము — అట్లయినఁ గౌశికుఁడు ప్రథమమున క్షత్రియుఁడా?

గాల — కాఁడామఱి? మహోదయాఖ్యపట్టణము రాజధానిగా నేలుచుండిన కుశనాభనృపాలునిసుతుఁడు గాధిరాజు. గాధిపుత్రుఁడు విశ్వామిత్రుఁడు.

రాము — అట్లయినఁ బారంపర్యముగవచ్చిన రాజ్యమువిడిచి యీయనయేల బ్రహ్మర్షిత్వముఁ గాంక్షించెను? ఆమహాపదవి నెట్లందఁగలిగెను?

గాల — అశేషకాలము రాజ్యపాలన మొనరించి పిదప నొకమాఱు మునికులసార్వభౌముఁడగు వసిష్ఠునితో విరోధించి యనేకవత్సరములుగ్రతపంబొనరించి బ్రహ్మర్షిత్వముఁబడసెను.

రాము — అసదృశకీర్తిమంతుఁడై మానవంశమునఁ బ్రఖ్యాతిఁగాంచిన హరిశ్చంద్రసార్వభౌముని సందర్భమున వసిష్ఠవిశ్వామిత్రులిరువురును గొంతకాలము మనస్తాపము గలిగియుండిరని వినియుంటిని. నీవనునది యావిరోధముఁ గూర్చియేకదా?

గాల — కాదు. హరిశ్చంద్రుని కాలమునకే విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షియైయుండెను. నేననునది యంతకుఁ బూర్వము జరిగినది.

రాము — అలాగా? అట్లయిన మునికులతిలకుండగు వసిష్ఠునితో విశ్వామిత్రమునీంద్రుఁడేల విరోధించెనో క్రమముని యెంచవేని సవిస్తరముగ నెఱింగించిన విని యానందించెద.

గాల — నాకేటిశ్రమ? నీవు సద్గుణమాన్యుఁడవు, విశేషించి మాక్రతుసంరక్షణ మొనరించుచున్నావు. అవశ్యము తెలిపెద నాకర్ణింపుము. తొల్లి ప్రజాపతికిఁ గుశుఁడను రాజుదయించెను. ఆకుశమహారాజు వైదర్భియందు వసువు కుశాంబుఁడు కుశనాభుఁడు సమూర్తరజుఁడను నలువురు పుత్రులఁ బడసెను.

కుశనాభునియందు గాధిజనించెను. ఆగాధిరాజే విశ్వామిత్రుని తండ్రి. గాధిరాజానంతరము విశ్వామిత్రుఁడు రాజై మహోదయాఖ్యపట్టణము నేలుచుండెను. కొంతకాలము పాలించి విశ్వామిత్రుఁడొకనాఁడు వనములోఁ గ్రుమ్మరి చతురంగబలములతోఁ గదలి వసిష్ఠాశ్రమమున కరిగి యతని దర్శించెను. వసిష్ఠుఁడు నతని నుచితరీతి సన్మానించి కామధేనువును రప్పించి దాని వలన షడ్రసోపేతమగు నాహారము సృజింపఁజేసి విశ్వామిత్రునకును నతని సైన్యమునకును బెట్టించెను. గాధేయుఁడు తృప్తిమై భుజించి వసిష్ఠునిఁజూచి "నీకొకలక్షమొదవుల ననేకలక్షలనర్ఘమణుల నిచ్చెదను. నీసురభిని నాకొసంగుము"ని వేడినఁ "దపస్వినైన నాకు మణులేటికి? ఈధేనువు నాకుఁబ్రాణపదము. దీని నొసఁగఁజాల"నని వసిష్ఠుఁడు నుడివెను. అంతఁ గౌశికుఁడు సేనలతో సురభిని బలవంతముగఁ బట్టించుకొని తనపురికి బయలుదేరెను. ఆ గోవును గొంతవడి వారివెంటనరిగి తన్నుఁబట్టికొని పోవు భటుల నొక్కుమ్మడిఁదన్ని విడిపించుకొని మహావేగమునవచ్చి యాశ్రమమున నున్న వసిష్ఠుని సమీపముఁజేరి యతని పాదములకడ భూమిపై తనమోరసాఁచి వినయము జూపుచు నశ్రుజలపూరితలోచనయై రొప్పుచుఁగ గద్గదికతోడ,

మ॥ "నినునేనాఁడిసుమంతదూర;మనమా • నీయందె వర్తించుచుం
డు;నినుఁబాసి క్షణంబునిల్వను;గురుం • డున్ దైవముఁ నీవటం
చని నిన్నమ్మి చరింతు;నట్టినను వి • శ్వామిత్రుసైన్యంబు చే
కొనిపోవంగ నుపేక్షసేయఁదగునో • కో స్వామి! నీకింకరిన్!".

అనివిచారమున విన్నవించి నిలిచెను.

రాము — ప్రాణపదముగఁ దాను పెంచుకొనిన ధేనువు కన్నీరుగార్చుచు విచారపడినప్పుడా మహాత్ముని కోమలహృదయ మెంత నొప్పిపడెనో?.

గాలి — మిక్కిలి నొప్పిపడెను. వసిష్ఠుఁడు పరమపవిత్రమగు నాగోవును వీపుదట్టి శృంగోపరిభాగమున మెల్లఁగా నిమురుచు ఖిన్నుఁడై "యమ్మా! నీవు నన్ను మిక్కిలిభక్తితోఁ గొలుచుటయే నిశ్చయము. నాకు నీయెడ భేదభావమావంతయులేదు. నిన్ను నాప్రాణపదముగఁ బ్రేమించుచుందు. మహాబలసంయుతుఁడగు విశ్వామిత్రునిదాఁకి నిన్నువిడిపింప శక్తిచాలక యూరకుంటినే కాని నీయెడ విశ్వాసములేక కాద"ని వచింప నా మొదవు "నీవిసుమంత కోపించిన

సచరాచర ప్రపంచమంతయుఁ దలక్రిందై పోవదే? నీకా విశ్వామిత్రుఁ డెంతవాఁ డెంత? నీవనుమతించితివేమో యని నేఁ గొంకక పడలేదు. నీ వానతిచ్చిన నేనపూని యా విశ్వామిత్రుని బలంబునెల్ల నశియించి నిమిషార్ధమున నీపాదసమీపమునకు వచ్చి వ్రాలెదను. నిన్ను విడిచి నేనుండఁజాల''నని వేఁడికొన వసిష్ఠుఁ డట్లఁగాక యనియె. అంత నాకామగవి హుంకరించిన నాయుధహస్తులైన భటులనేకలక్షలుదయించి యొక్కపెట్టున గాధేయుని సైన్యములపైఁ గవిసి నిమిషమాత్రమున రూపుమాపిరి. అదిగని విశ్వామిత్రుని పుత్రులు నూర్వురు మిక్కిలి కినిసి వసిష్ఠునిపైఁ బడి తీవ్రశరంబుల నొంచఁగా నమ్మహాత్ముఁ డాసుతశతకంబును భస్మసాత్కృతముగఁ జేసివైచెను. సైన్యము సర్వస్వమును గొడుకులు నూర్వురు నశించిన విశ్వామిత్రుఁడు శృంగభంగమొందిన గోరాజము చందంబున హతపక్షియైన మహానాగేంద్రము కైవడి బలము చెడి ప్రబలపరాభవ జనితక్లేశంబున రాజ్యపాలనము పుత్రులపై వైచి హిమవత్పర్వతమునకేగి యీశ్వరునిఁ గూర్చి ఘోరతపమాచరించెను. మహాదేవుఁడు ప్రత్యక్షమై యిష్టమగు వరంబు వేఁడుమనఁగా ''ధనుర్వేదము సాంగోపాంగముగా నాకుపదేశించి సురగరుడోరగసిద్ధసాధ్య విద్యాధరులకడ నేయే యస్త్రంబులుండు వానినన్నింటిని నాకనుగ్రహింపుము''ని వేఁడిన నట్లనరనొసఁగి యీశ్వరుఁడరిగెను. బహుశాస్త్రలాభంబున ద్విగుణితసత్త్వుఁడై కౌశికుఁడు వసిష్ఠాశ్రమముఁ జొచ్చి హరిచండమార్గణాస్త్రల గురియింప నమ్మహాగ్నిచే నాశ్రమము ముట్టుకొని మండఁ జొచ్చెను. అంత నచ్చటిమునులు భయపడి వసిష్ఠునిమఱుఁగు జొచ్చిరి. ఆ మునిశార్దూలుఁడు ''నోడకుఁడ''ని వారల వారించి మహాపరిఘయాగ్నిహోత్రునిభంగి నుండి విశ్వామిత్రునిపై నెత్తివచ్చి నిజభుజాదండమండితప్రచండబ్రహ్మదండంబున నాశాస్త్రాస్త్రములనెల్ల వారించెను తనశరసమూహములు నీరుపైఁబడిననిప్పులవలె నశించుటఁ జూచి గాధేయుఁ డాశ్చర్యమాహేంద్రమోహన గాంధర్వాద్యనేకాస్త్రంబులఁ బ్రయోగించెను.

మ॥ బలముల్ గర్వము మచ్చరంబెదుగ వి♦శ్వామిత్రుఁ డేయేశరం
బులనస్త్రంబుల నేసె వానినఖిలం♦బుల్ బ్రహ్మదండంబుముం
గలకుల్ సాఁచి వసిష్ఠుఁడుక్కుచెడిపో♦గా మ్రింగఁజేసెన్; మహా
త్ములకున్ మేరువుగడ్డిపోచయు మహా♦బ్ధుల్ పిల్లకాల్వల్ గదా?

బ్రహ్మదండము సర్వాస్త్రములను మ్రింగఁగా వసిష్ఠుఁడు బ్రహ్మతేజోవికాసమూర్తియై నిలిచినంతఁ గౌశికుఁడు మఱింత విషాదమునొంది బ్రహ్మాస్త్రము నరివోసి ప్రయోగించెను. అదితీవ్రజ్వాలలు భూనభోంతరము నింపఁజొచ్చుచు నేతేర వసిష్ఠుఁడమ్మహాబ్రహ్మాస్త్రమును బ్రహ్మదండమునఁ జెంతకురాఁబట్టి యొక్కసారిగఁ బాఱమ్రింగెను. అంత నవ్వసిష్ఠుని దేహంబునుండి మహాగ్ని వెలికివచ్చి వ్యాపింపఁదొడంగిన నచ్చటి మునులందఱు భయమునొంది వేఁడికొన నామహాత్ముఁడాయగ్ని నంతయును లోనణఁచివైచెను. ఆమునీంద్రుని సామర్థ్యమనన్యదుర్లభమని లోకములన్నియుఁ గొనియాడెను.

రాము — తప్పక కొనియాడవలసియున్నది. ఆత్మబలదేహబలములకు వసిష్ఠవిశ్వామిత్రులిరువురను ప్రబలదృష్టాంతములుగాఁ గొనవచ్చును. అమోఘమైన యాత్మబలము ముందఱ దేహబలమణుమాత్రమును పనిచేయఁజాలదు. ఆత్మబలమే నిశ్చయమైనబలము. తదితరము కాఁజాలదు. వసిష్ఠమహాత్ముని బలమును మనస్థైర్యమును నిరుపమానములు.

తే।గీ॥ అలచతుర్దశలోకముల్ ♦ గలిసెనేని
కన్నుసన్న నోర్వఁగల య ♦ ఖండశక్తి
గలిగియును మునుల్ వేడిన ♦ కారణమున
శాంతిఁగనె వసిష్ఠునిమది ♦ యెంతమృదువొ!.

లోకములనెల్లఁ జీకాకుపడఁజేయఁజాలెడు శక్తిగలిగియుండియు భగవానుఁడు వసిష్ఠుఁడు మాకటి శిశువువలె మెలంగుచుండును. ఆమహాత్ముని శాంతగుణమేమనవచ్చును!

గాధి — అశాంతిగుణమెవరికిని లేదు. కౌశికుఁడు బ్రహ్మబలంబుముంగల తనరాజబలము పనిచేయమిఁగనుంగొని తానెట్లయిన బ్రహ్మర్షిపదమునొందఁగోరి దక్షిణదిశకేగి పత్నియుఁదానునుగ్రతపముసేయఁదొడఁగిరి. ఈమధ్యకాలమున విశ్వామిత్రునకుఁ బుత్రులఁగనియె. కొంతకాలమునకు బ్రహ్మ ప్రత్యక్షమై రాజర్షిపదంబొసఁగెను. గాధేయుఁడు దానఁదృప్తినొందక పుష్కరక్షేత్రమునకేగి యనేకవిఘ్నములకోర్చి పెక్కేఁడులుగ్రతపంబొనరింప మరల బ్రహ్మవచ్చి మహర్షిపదంబిచ్చి చనియె. అదానితోఁదనివిసనక మరల నెన్నియో

వత్సరములు తపముగావింప నపుడు బ్రహ్మాదిదేవతలు వచ్చి "విశ్వామిత్రా! నీవు బ్రహ్మర్షివైతివి. క్షేమ్మ"ని కొనియాడిన నతండును "వసిష్ఠుఁడు స్వయముగా వచ్చి చెప్పినఁగాని నమ్మన"ని పలికి వెండియుఁ దపమొనరింప దొరకొనియె. అంత నచ్చతురాననుని కోరికకై వసిష్ఠుఁడచ్చటికరుదెంచి,

మ॥ "అనఘా! నీమతపోమహత్త్వమున బ్ర • హ్మర్షిత్వముం గల్గెఁదాఁ
గనెనత్యంతముదంబు బ్రహ్మ మదిశం • కన్ మానుమా లెమ్ము నా
మ్న"నిగాధేయుని జేరి కౌగిలులడా • యన్ బట్టి నమ్మౌని నె
క్కొనఁగా నేర్చునె క్షీరమానసములన్ • క్రోధంబు గర్వోద్ధతుల్?

అప్పుడచ్చటనున్న దేవతలందఱు వసిష్ఠుని శాంతసౌజన్యముల మిక్కిలి కొనియాడిరి. ఈవిధమున గాధేయుఁడు బ్రహ్మర్షిపదంబునొంది తపోధనశ్రేష్ఠుఁడయ్యెను.

తే॥గీ॥ ఆది నృపుఁడయ్యు రాజర్షి • యై మహర్షి
యై యటుపయిని బ్రహ్మర్షి • యౌ మునలరె;
బహుళకార్య నిర్వాహక • త్వంబు నెడలఁ
బట్టుదలయందుఁ దనసాటి • పుట్టకుండ.

ఇది యమ్మహాత్ముఁడు వసిష్ఠునితో మెలంగిన ప్రకారము. గాధేయుఁడు దక్షిణామునఁ దపమొనరించి రాజర్షియైన పిదప నొనరించిన విశేషమొకటిగలదు. మీ వంశోధరుఁడగు హరిశ్చంద్రుని జనకుఁడగు త్రిశంకుండు వసిష్ఠునిఁ జేరి బొందితోడ స్వర్గమునకేగ వీలయిన యొకక్రతువు దనచేఁ జేయింపుమని కోరెను. వసిష్ఠుఁడు "సశరీరముగ నాకమునకేగ వలనుపడదు పొమ్మ"నినుడివెను. అప్పుడు దక్షిణమున నుగ్రతపంబు గావించుచున్న వసిష్ఠపుత్రులకడకేగి త్రిశంకుఁడు వసిష్ఠమునీంద్రుఁడు చెప్పిన ప్రకారమంతయు విన్నవించి తనతో సవనము చేయింపుఁడని వారల బ్రార్థించెను. "వసిష్ఠుఁడు చేయింపఁజాలని క్రతువెవ్వరునుఁ జేయింపఁజాలరు పొమ్మ"ని యమ్మునికుమారులు పలికిరి. త్రిశంకుఁడు కోపించి "మీరొక్కరుగురువులు"ని తిరస్కరించి పలికెను. అంత నవ్వాసిష్ఠులు కనలి "చండాలుఁడవుగమ్మ"ని త్రిశంకుని శపించిరి. తనదుస్థితికి వగచి త్రి

శంకుఁడు విశ్వామిత్రుని సన్నిధిఁ జేరి తనవిషయమంతయు విన్నవించుకొనెను. అమ్మహాత్ముఁడు "క్రతువవశ్యము చేయించెద"నని పలికి తనశిష్యులఁ బంపి దేశమునఁగల మునులనందఱఁ బిలిపించెను. వసిష్ఠుని కుమారులును మఱికొందఱుమునులు మాత్రమురాక "యిదియేటి చండాలక్రతువ"ని పిలువఁబోయిన వారితోఁ బలికి గేలిచేసిరి. ఆమాటలు శిష్యులవలన విని వసిష్ఠతనయుల"రాక్షసులు గండ"ని శపించి తానయాజకుఁడై మఖంబు నిర్వర్తించి,

మ॥ జనసంత్రాసకరోగ్రసత్త్వుఁడఁగు వి ♦ శ్వామిత్రుఁడంతన్ ద్రిశం
కుని హస్తంబునఁబట్టి యాకసముది ♦ క్కున్ జేరఁగా నెత్తి "యో
జననాథోత్తమ! నీవు నీయొడలుతో ♦ స్వర్గంబుఁ జేరంగఁ బొ
మ్ము"ని పొన్నైచినఁ బోయి యుడుగ్గ డెన్నృపా ♦ లాధీశుఁడున్ నాకమున్.

ఇట్లు పరసుపావనమగు నాకసమీపభూమలను,

మ॥ దరియన్ బోయినయాత్రిశంకుఁగనిసు ♦ త్రాముండు "చండాల! యా
ధరపైఁగూలుము"టంచుఁదోసిన "మునీం ♦ ద్రా! చాల కారుణ్యము
న్బరవన్ బోలు"నటంచు జారునెడ వి ♦ శ్వామిత్రుఁడత్యంత భా
స్వరశక్తిన్ నిలిపెన్ ద్రిశంకుని నభో ♦ భాగంబునందొక్కెడన్.

అట్లునిలిపి యచ్చటికేగి "స్వర్గమునకుఁ బ్రతిస్వర్గంబును దేవతలకుఁ బ్రతిదేవతలను సృజించిపుచ్చెద"నని విజృంభించిన దేవతలును దివ్యమునీంద్రులునువచ్చి గాధేయునిఁ జేరి "మహాత్మా! నీవు సర్వజ్ఞుండవు. నీకుఁ దెలియని ధర్మములుండునే? ప్రతిసృష్టికి దొరఁకొని దేవతలను సప్తర్షులను సృజింపకుము"ని సామోక్తులాడి వేఁడికొన గాధేయుఁడెట్టకేలకు శాంతినొంది "నేవతని నాకమున నిల్పెదనంటిని. నాపలుకు వృథగాకుండ నిచ్చట నీనక్షత్రముస్యమునఁ దలక్రిందుగ నున్నవాఁడున్నట్లు త్రివిష్టపమెంతవఱకుండు నంతవఱకుఁ ద్రిశంకుఁడుండుగాక"యని నిలిపి వెడలిచనియె. దేవతలతనిఁబొగడి దివికరిగిరి.

తే।గీ॥ ఒక్కఁడుఁడుతన్నుఁజేరి "యో ♦ హో మునీంద్ర!
యనుచుఁ బ్రార్థింపవలెఁగాక ♦ యదిజగత్ర
యైకదుస్సాధ్యమగు పని ♦ యైన నిర్వ
హించి యుపకరించు నుదార ♦ హృదయుఁడతఁడు.

మాటమాత్రమే కొంతకఠినమే కాని యాతఁడు కపటమున నెట్టిదియో యెఱుంగని పెద్దజడదారి. ఇట్టి యమాయికుఁడు గావుననే త్రిశంకునకై యంతగ శ్రమచేసినది. ఈత్రిశంకునిపుత్రుఁడే హరిశ్చంద్రుఁడు.

తే॥గీ॥ ఆహరిశ్చంద్రు నిత్యస ♦ త్యవ్రతంబు
జగమునకుఁజాటఁగా వసి ♦ ష్ఠమునితోడఁ
గనలి యటుజేసెఁగాని ని ♦ క్కమ్ముఁజూడ
నాహరిశ్చంద్రుపై గూర్మి ♦ యగ్గలంబు.

ఈయనమానసము మిక్కిలికోమలము. ఒరులొకించుక కష్టపడుచుండినను జూడ నోపక యప్పటప్పటికేగి వారల కష్టములఁదొలఁగించి సౌఖ్యముఁగలిగింప యత్నించెడి జగదేకకుటుంబి. తొల్లి యంబరీషుఁడను నృపాలుండు యజ్ఞ మొనరించుచుండ నింద్రుఁడాయజ్ఞపశువును గొనిపోయెను. యాజకుండెంతైన నొకనరపశువుఁదెమ్మని రాజునకుజెప్పఁగా నతఁడు ముప్పురుకొడుకులుగల ఋచికుఁడను మునికడకేగి "తపస్విప్రవరా! నీకొకలక్షధేనువుల నిచ్చెదను. నీకుమారులలో నొకనిని నాకు యజ్ఞపశువుగా నిమ్మ"ని కోరెను. ఋచికుఁడును "నగ్రపుత్రుఁడుదప్ప తక్కినవారిలో నీవిష్టపడెడువానినిఁ గొనిపొమ్మ"ని చెప్పెను. ఋచికునిసతి సత్యవతీదేవి "కనిష్ఠకుమారుఁడు తప్ప తక్కిన వారిలో నీయిచ్చకువచ్చినవానిఁ దోడ్కొనిపొమ్మ"ని నుడివెను. అంత వారిద్వితీయపుత్రుఁడు శునశ్శేఫుఁడు వచ్చి "నేను తలిదండ్రుల కిరువురకుఁ గొఱమాలినవాఁడ. నీవిచ్చెదనన్న లక్షమొదవులను మాయయ్యకొసఁగుము. నేనునీ వెంటవచ్చెద"నని చెప్పెను. అంబరీషుఁడును లక్షగోవులనిచ్చి శునశ్శేఫునివెంటఁగొని మార్గమునఁ బుష్కరక్షేత్రమున విడిసెను. శునశ్శేఫుండచ్చటఁ దప మొనరించుచుండిన విశ్వామిత్రునిఁజూఁబోయి "నాతలిదండ్రులు నన్నుయజ్ఞపశువుగా నంబరీషునకమ్మికొనిరి. నీవు నాకు మేనమామవగుట నీతోవిన్నవించుకొంటిని. నన్నురక్షింపుమ"ని వేఁడికొనెను. విశ్వామిత్రుఁడు తనపుత్రులఁబిలిపించి "మీలోనొక్కరుఁడేగి యంబరీషునకు యజ్ఞపశువై యీశునశ్శేఫుని దప్పింపుఁడ"ని యాజ్ఞాపింప నాకుమారులు భయమొంది యతనియానతినిఁ బాలింపరైరి. "శునకమాంసముఁదినుచుఁ బెక్కేఁడులిముమలు గుడువుఁడ"ని విశ్వామిత్రుఁడు కొడుకుల శపించి శునశ్శేఫునకు మంత్రోపదేశంబు గావించి పంపించెను. అంబరీషుని యజ్ఞసమయమున నామంత్రములు జపింప

గానింద్రుఁడేచ్చటికే తెంచి రాజునకు యజ్ఞఫలంబొసఁగి మునికుమారుని ప్రాణరక్షణంబొనరించెను. ఇమ్మహాత్మునకెప్పుడును పరోపకారమే పరమదీక్ష.

క॥ జనులకు నుపకారముసే
యని దుర్మతులాప్తులయిన ♦ నహితులె తైనన్
దనయులయిన నోర్వఁగనే
రని నియతాత్మకుఁశతండు ♦ రామనృపాలా!.

ఈశునశ్శేఫునితల్లి సత్యవతీదేవి గాధిరాజుకుమార్తెయగుటచే విశ్వామిత్రునకుఁ దోఁబుట్టువు. ఆసత్యవతీదేవి భర్తయగు ఋచీకుఁడు గతించినవెనుక బొందితోడ స్వర్గమునకేగి పిదప హిమవంతమునఁ గౌశికీనది యయి పుట్టి యిందెల్లఁ బ్రవహించుచున్నది. భగినీస్నేహబలమున విశ్వామిత్రుఁడీకౌశికీనదీతీరమున నాశ్రమమేర్పఱచుకొని యిచ్చట వసించుచుండును. ఇది సిద్ధాశ్రమమనుపేరఁ బరగుచున్నది. రఘువరా! నీవును లక్ష్మణుఁడును సిద్ధాశ్రమవాసులగు మునులయాగంబు రక్షించి కీర్తిఁబడసితిరి.

రాము—సుచరిత్రుఁడవగు నోగాలవా! మహామహిమాన్వితశోభితుఁడును తపోధనశ్రేష్ఠుఁడును నగు విశ్వామిత్రుని దివ్యచరిత్రమును సత్యవతీదేవి మహిమమును త్రిశంకుహరిశ్చంద్రుల విషయములను వినిపించి నన్నును లక్ష్మణుని ధన్యులఁ జేసితివి. సిద్ధాశ్రమమును సిద్ధాశ్రమవాసులగు మునులను దర్శించి సేవించి మిక్కిలి కృతకృత్యులమైతిమి.

గాల—మాగురుఁడు విశ్వామిత్రుని చరిత్రము వచించి నేను పునీతుఁడనైతిని.

(ప్రణతినభినయించి) రామచంద్రా!

శా॥ "ఈహవ్యంబుల సర్వదేవతలకం ♦ దియ్యంగదే దేవ! యో
స్వాహావల్లభ! పావకా!"యనుచు వి ♦ శ్వామిత్రమౌనీంద్రుఁడు
త్సాహంబొప్పఁగఁదీర్పఁగాఁదొడఁగె య ♦ జ్ఞప్రక్రియల్ దైత్యసం
దోహంబుల్ భయమొందనిల్వఁడుధను ♦ ర్ధుర్వారులై యిర్వురున్.

రామచంద్రా! నేను యజ్ఞశాలకు వెళ్లెదను. మీరిరువురు జాగరూకులరై యుండుఁడు.

రాము—

మ॥ కనులల్లార్పక దృష్టినొక్కట మహో ♦ కాశంబునన్ నిల్పుచు
న్మనసేకాగ్రముచేసి బాణములవిం ♦ డ్లన్ జేతులన్ దాల్చి నే
నునుసౌమిత్రియుఁగూడి యీదనుజసం ♦ దోహంబుగన్పించినం
తనఖండింతుము నీవువెళ్ళిక్రతువు ♦ త్సాహంబునన్ జూడుమా!.

నేనును లక్ష్మణుఁడును మిమ్మెల్లఁగన్నులఁగాచి యుందుము, నిర్విచారులై యజ్ఞ క్రియలనొనరింపుఁడు.

గాల—మంచిది. మీరు హెచ్చరికతోనుండుఁడు. (నిష్క్రమించుచున్నాఁడు.)

రాము—లక్ష్మణా! యీదినము మనము మఱింతమెలఁకువతో మెలంగవలయును. ఈయైదు దినములును సామాన్యరాక్షసులే వచ్చుచుండిరి కాని మారీచసుబాహులు రాలేదు. ఈదినము తప్పకరావచ్చును.

లక్ష్మ—దేవా! విశ్వామిత్రుఁడు చెప్పినపుడంతయు వీరినిగుఱించియే చెప్పుచుండును. ఈరాక్షసులెవ్వరు? వీరి నివాసములెవ్వి?.

రాము—లక్ష్మణా! మనముచూడకున్నను వారలుమనకుఁ గ్రొత్తవారుకారు. సుందోపసుందులను దైత్యులపుత్రులీ మారీచసుబాహులు. సిద్ధాశ్రమమునకు వచ్చుమార్గమున నేను గూల్చినతాటక యీమారీచునితల్లి. వారిరువురును [illegible] గుచుండిరి. వారిని వారితల్లియగు తాటకయొద్దకనుపుదము.

లక్ష్మ—అట్లయిన వారల మనముపేక్షింపఁగూడదు.

రాము—మనముసిద్ధముగ నున్నాముకదా? సౌమిత్రీ! యీసిద్ధాశ్రమము ఘనాలోకనాకమైయున్నది.

క॥ జలజాసనప్రభావుం
డలఘుఁడు గాధేయుఁడితని ♦ యాశ్రమమున యం
దలి నానాపక్షులుమృగ
ములు వైరముమాని నెయ్య ♦ మున మనునసుజా!.

లక్ష్మ—అవునీసిద్ధాశ్రమవాసము మహానందదాయకముగ నున్నది. మహోమవేదిక

కముఁ గూడిన మునుల సామగానంబులు కర్ణపేయములుగ నున్నవి. ఇదియు విఘ్నములులేకుండిన నెంతో బాగుగ నుండును.

రాము — బాగుగ నుండును కాని మనమనుకొనునట్లు జరుగునా?

[లోపలధ్వని.]

లక్ష్మ — దేవా! యేమి యీ విపరీత ధ్వానము?

మ॥ కమలేజప్రభవాండమంతయును వ్ర • క్కల్ వ్రక్కలుగా జేయనే
ర్చు మహోదుర్భరభూరినాదమిది; యి • చ్చో లోకదుర్వారవి
క్రమగర్వాంధులు దైత్యనాయకులు రాఁ • గానుం ద్రుంగాఁబోలు వే
గ మహాచాపముఁ గొమ్ము వీరిసమయం • గాఁ జేత మొక్కుమ్మడిన్.

దేవా! మహాధనువు నెక్కిడుము. నేనును సహాయుఁడనై నీవెంట నుండెద. మనపై నెత్తివచ్చెడు రాక్షసులనందఱ సంహరించి గాధేయునకు మోదముఁ గూర్చెదము.

రాము — లక్ష్మణా! నీయుత్సాహమునకుఁ జాలసంతసించితి. కాని యీతుచ్ఛదైత్యులనొంచుట కిరువురేల?

సీ॥ అతిముదావహమౌచు • నలరు సిద్ధాశ్రమ
స్థానమే యాయజ్ఞ • శాలగాఁగ
లోకభయంకర • శ్రీకిఁదానకము నా
పటుమహాధనువు యూ • పంబుగాఁగఁ
వచ్చుపిడుగులై • చెలఁగు మచ్చరపరం
పరలు చక్కని స్రుక్స్రు • వములుగాఁగ
భూనభంబులను మా • ర్మ్రోయించు టంకార
నాదంబు వేదమం • త్రంబుగాఁగ
తే॥గీ॥ గాధికోపంబు పవనాగ్ని • గాఁగ నేను
యజ్ఞకర్తనై యిటవచ్చు • నసురవితతి
భస్మమొనరింతు బహుపశు • పంక్తిఁ జేసి,
లక్ష్మణా! నాదు ధనువుబ • లంబుఁ గనుము!

సౌమిత్రీ! గురువరుఁడు విశ్వామిత్రుఁడేదొనరింపుమని యనునో దాని నేను ధైర్యముగా నాచరించెదను.

(రెండవ ప్రవేశము మారీచసుబాహులు.)

మారీ — ఓరీ! సహోదరుఁడా!

ఉ॥ ఈనవనంబునన్ జెలఁగ • నీడుకు నిన్నను మొన్న లోకసం
త్రాసకరోగ్రమౌ బలము • దక్కి జనుడెంచిన సద్భటుల్ మదీ
యాసురులెల్ల మీబలము • నందముఁ జందముఁ గూర్చి మాకుప
న్యాసములిచ్చినారలు సు • సంబున మేమును సంతసింపఁగన్.

మీచరిత్ర వినియే మేమిందు వచ్చితిమి. పిల్లలను బదిపఁడినను బట్టి యాశ్రమమునఁ దిరుగాడినంతనే క్రతురక్షక గౌరవము గలుగునని తలంచితిరి కాఁబోలు. ఇంక మాకొలఁదియు తెలియఁగలరిరి. మిమ్ముఁ జూచిన నాకు జాలి కలుగుచున్నది. నావాక్యములిప్పుడైన గ్రహింపుఁడు.

క॥ ఏనను డెంచినయపుడు భ
వానీనాయకుఁడు వెడలి • వచ్చియు నెదురం
గా నేరఁడీవు బాలకు
లీనిక్కేమిటికి? మాని • యేగుఁడు పురికిన్.

రాము — ఓ దురాత్మ రక్షసాధమా!

తే॥గీ॥ ప్రబలరాక్షసలోక సం • తాపకరము
మద్ధనుర్ముక్త తీవ్రాస్త్ర • మహిమమిప్డు
తెలియఁగనుండియు నీకుఁదొం • దరయిదేల?
తుదుమఁబోయి కూరలరుచి • యడుగనేల?

ఆకలిమై నుండెడి సింహరాజంబుఁ జేరి కోరలు వాడిగా నుండవనుకొనెడి వెఱ్ఱిఁడివై యుందునే? నాపరాక్రమంబును గూర్చి నీతల్లి తాటక నడిగి తెలిసికొనుము.

మారీ—

శా॥ ఏమీ! నాజనయిత్రి తాటకబలం ♦ బేపారనాప్రాంతను
ద్దామారణ్యములో మెలంగఁగనుహో ♦ దర్పాంధుఁడై స్త్రీయటం
చేమేనెంచక చంపినట్టి ఖలులా ♦ యామీరు! పోనీ యికే
నామృత్యుంజయుఁడడ్డమైనమీమున్నా ♦ హోరంబుగా మ్రింగెదన్.

నాకోర్కె పండినది. అస్మన్మాతృహంతలగు మిమ్ము రయమునను భస్మము సేయకున్న, నాకోపాగ్ని చల్లారదు. రండు మీకేఁ చవు సేఁ చెద.

రాము— మీకు రోసమెత్తి మీకుఁగల శక్తినంతయు నుపయోగించి యుద్ధము చేయవలెననియే యీవిషయము నేను ముందుగఁ జెప్పితిని. ఎంతకాలము నుండియో మీయిచ్చవచ్చినట్లు తిరిగితిరి. మీవిహారము నేటిదినముతోఁ బరిసమాప్తములయ్యెనని తలంపుఁడు.

మ॥ జననంబాదిగ దుష్ప్రవర్తనములన్ ♦ స్వాంతంబుఁ బొందించి మా
నినికాయంబులొనర్చు యాగములకున్ ♦ విఘ్నంబుఁ గావించి నా
కనివాసుల్ గడుకష్టవార్నిధి మునుం ♦ గన్ జేయుమీమ్మున్ మదీ
యనిశాతాస్త్రపరంపరల్ బరపి ప్ర ♦ య్యల్ చేసి మోదించెదన్.

మీవంటి యసురులఁ గూల్చి లోకమునకు మేలు గూర్చుటయే మాకగ్రధర్మము.

లక్ష్మ— దేవా! కాలమెక్కుడుగ సాగుచున్నది.

క॥ వినయవివేకగుణము లెం
దునుఁ జూచిన లేని వీరి ♦ తో మాటలతోఁ
బెనఁగంగ నేల? శరములు
ధనువున సంధించి కొట్టు ♦ దము శీఘ్రముగన్.

సుబా— ఏమహో మహావీరుండవు! భువనత్రయమునఁ గలవీరులఁ జూచితిని. పోరాడితిని. గెల్చితిని. మీవంటి దుర్బలులతో యుద్ధమేటికి? ఊరకపట్టి పొంగిరించుదును. నిన్ను నీయన్న నిప్పుడే నాపొట్టలోఁ బెట్టుకొనెద. విశ్వామిత్రుని సవనము నింకపాలు గావించెద.

రాము — రాక్షసాధమా! చక్కనిలువుము. నానిశాతబాణంబుచే నీదేహము శకలీభూతముగావించెద. (అని యస్త్రము దొడిగి.)

మ॥ వనజాతాప్తకులుండు రాఘవుఁడు వి ♦ శ్వామిత్రు యాగంబుఁగా
వను మారీచసుబాహులిర్వురను గో ♦ పస్ఫూర్తిమై బట్టి కూ
ల్పను జిత్తంబున నెంచెఁ గావున దృణ ♦ ప్రాయంబుగాఁ జేసి యొ
య్యన నీచులఁ జిమ్మవేయఁగదె వా ♦ యవ్యాస్త్రమా! యియ్యెడన్.

[అస్త్రము విడువఁగా మారీచసుబాహులు దూరమునకెగిరిపోదురు.]

లక్ష్మ — దేవా! నీవాయవ్యాస్త్రంబున నాదానవులు ప్రభంజనునిఁ దాఁకునను నీలాభ్రములవలె విఱిఁగి చెల్లాచెదరైపోయిరి.

రాము — లక్ష్మణా! సవనపూర్తి జరుగు నీశుభసమయమున రాక్షసవధ నిచ్చట నేలజరగవలెనని దూరమునకుఁ గొనిపోవునట్లు వాయవ్యాస్త్రమును బ్రయోగించితిని.

లక్ష్మ — మంచిపనిచేసితివి.

[ప్రవేశము విశ్వామిత్రుఁడు.]

రామచంద్రా! సవనపూర్తియైనది. మారీచసుబాహుల వలనఁ జెడకుండఁ గ్రతుసంరక్షణమాచరించితివి. బలవంతముగఁ దోడ్కొనివచ్చినను మీతండ్రికడ నామాట చెల్లించితివి. మహర్షీంద్రులలో నేను తలయెత్తి తిరుగునటు చేసితివి. నాకుఁ జాల సంతోషము గలిగినది.

రాము — అంతయు నీయనుగ్రహము.

చ॥ మునివర! కోసలాన నొక ♦ మూలను పేరుప్రతిష్ఠ లేకయుం
డినయొక బాలకున్ ననుఁ గ ♦ డింది ధనుర్ధరుఁ గాఁగఁ జేసి ధా
త్రిని గడుఁ గీర్తిసంపదలఁ ♦ దెచ్చితి; నీకు ననుగ్రహంబు గ
ల్గిన నిరుపేదనైనియు ని ♦ లింపపతిన్ బొనరింతు వెమ్మెయిన్.

దేవేంద్రునితోఁ బ్రతిఘటించి ప్రతిసృష్టిగావించిన ధీరుండవు. వసిష్ఠమహాత్మునితో నీకుఁ గలిగిన కయ్యంబు తెలుపును త్రిశంకు చరిత్రంబును శునశ్శేపుని

వృత్తాంతమును గాంచుచుండు మాకుఁగరుణతోఁ జెప్పియుంటివి. నీచరిత్రమత్యంతపుణ్యప్రదము. కౌశికీనదియై ప్రవహించిన నీతోఁబుట్టువు సత్యవతీదేవి త్రిభువనపావని. నీసిద్ధాశ్రమము జనస్థానములకే కాదు దేవతలకైన సందర్శనీయము.

విశ్వా — సత్క్షేత్రగతమైన బీజమువలె నా నేర్పినవిద్య నీయందుఁ బ్రకాశించినందులకానందించుచున్నాను.

క॥ తననేర్చువిద్య సూక్ష్మము
గను నేరిచి యదను గల్గఁ ◆ గా నుపయోగం
బొనరించి కీర్తిఁగను శి
ష్యునిబడయఁగఁగనుట గురుని ◆ సుకృతముగాదే.

రామచంద్రా! సిద్ధాశ్రమమునఁ బనులు పూర్తియైనవి. మిథిలానగరమున జనకమహారాజు తనకూతురి స్వయంవరోత్సవము నొకసవనము చేయుచుండి తనపురోహితుని నాకొఱకై పంపియుండెను. దశరథునకుఁగూడ నాహ్వానము చేరియుండుననివిన్నాను, జనకదశరథులిరువురు నాప్తమిత్రులగుట దశరథుఁడు విదేహమునకుఁ దప్పకవచ్చును. స్వయంవరోత్సవమునకు జగంబునఁగల రాజపుత్రులనేకులువచ్చెదరు. మనమీదినము పయనించుదము.

రాము — జనకమహారాజు యాజ్ఞవల్క్యమునిశిష్యుండనియు గొప్పబ్రహ్మవేత్తయనియు వినియున్నాను. ఆమహనీయుని దర్శింపవలెనని నాకును కుతూహలము గలదు. మఱియుఁబెక్కుదేశముల రాజన్యులనొక్కచోఁ జూచుటకు స్వయంవరకాలములు ఉచితసమయములు. అవశ్యము పయనించుదము.

విశ్వా — మిథిలానగరమునకుఁ బోవుమార్గమున ననేకపుణ్యస్థలములను నదీవరములను జూడవచ్చును. మిక్కిలి ముఖ్యముగా,

శా॥ రంగత్తుంగమహోతరంగఁ గృతగీ ◆ ర్వాణస్రవంతీపరి
ష్వంగన్ గల్పితపాపభంగ విశదాం ◆ స్సంగతాంగన్ నట
ద్భృంగన్ శంకరమౌళిసంగ నతుల ◆ శ్రీకీర్తిసంధాయకా
పాంగన్ గంగనుఁజేరి వందనముసే ◆ యన్ గందుమాత్రోవలో.

# సీతాకల్యాణము.

## చతుర్థాంకము

---

### మిథిలానగరము-జనకుని సభాభవనము.

జనకదశరథులు, వసిష్ఠవిశ్వామిత్రులు, రామలక్ష్మణులు, సీత, చెలికత్తెలు, శతానందుఁడు, నానాదేశరాజన్యులు, నుచితస్థలములఁ గూర్చుండియుందురు.

జన—దశరథా! నీవు వచ్చుట నాసకలబంధువులును వచ్చినట్లు. ఈవసిష్ఠవిశ్వామిత్రులరాక శివకేశవుల యాగమనమువలె నాకధికోత్సాహము గలిగించుచున్నది.

వసి—మేము నీయింటికివచ్చుటలో విశేషమేమియులేదు. అవశ్యము రావలసినవారమేకదా?

జన—మీకు నాయెడఁగల విశ్వాసమట్టిది.

శతా—వీరిరాక నాకొక మహోపకారముఁ దెచ్చినది. విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులఁదోడ్కొని సిద్ధాశ్రమమునుండి మిథిలాపురికి వచ్చుచుఁద్రోవలో గౌతమాశ్రమమును సమీపించెనఁట. గౌతమశాపభరమున నఖిలభూతాదృశ్యయగు నహల్య యీరాఘవచంద్రుదర్శనమున మేఘముతొలఁగిపోవఁ బ్రకాశించు చంద్రకళవలె శాపమువాసి పొడకట్టెనఁట. నాజనకుఁడు గౌతముఁడు శాపవిముక్తయగు నహల్యను జేరఁదీసి యాదరించెనఁట. ఈవిధమున విశ్వామిత్రుఁడును రామలక్ష్మణులును నాకుఁ జిరస్మరణీయులు.

జన—మహనీయగుణాలంకృతులగు రామలక్ష్మణులు నామిత్రుఁడగు దశరథుని పుత్రులగుట నేను ద్విగుణితముగ సంతోషించుచున్నాను.

శతా—వీరు కేవలముదాత్తవర్తనము గలవారు.

(లోపల గంట మ్రోగుచున్నది.)

జన — మహాత్ములారా! నిర్ణీతముహూర్తము సమీపించినది. మహారాజకుమారులనే కులు వచ్చియున్నారు. స్వయంవరకార్యములకుపక్రమింప సెలవొసంగుఁడు.

ఎసి — ఆలస్యమేటికి? ఇది సుసమయము. అదె భటులు చంద్రశేఖరు శరాసనముఁ దెచ్చుచున్నారు. ఇఁకఁ బ్రారంభింపుఁడు.

(భటులు మందసఁ దెచ్చిపెట్టుచున్నారు.)

జన — (లేచి) ఓసకలదేశాధీశ్వర కుమారులారా! నాయాహ్వానము గారవించి శ్రమమనియెంచక యింతదూరము వచ్చినందులకై హృదయపూర్వకముగా సభినందించుచు మీకందఱకు స్వాగతమొసంగుచున్నాను.

తే॥గీ॥ మందరగిరీంద్రమట్టి యి ♦ మ్మందసమున
నలసినిద్రించు నొకకొండ ♦ చిలువయట్లు
కడుబలిష్ఠమౌ నొకదొడ్డ ♦ కార్ముకంబు
వఱలుచున్నది చూపఱు ♦ వెఱఁగుపడగ.

మహాప్రాభవ సంపన్నుఁడగు దక్షుఁడాదికాలమున నొకగొప్ప యధ్వరంబొనరింపనెంచి దేవతలనందఱ రావించెను. సవనపూర్తియయినంత నెల్లనిర్జరులును దమతమ హవిర్భాగములుగాని యీశ్వరునకు మాత్రము యజ్ఞభాగమునొసఁగకపోయిరి. విపర్యకరణముగఁ దననిట్లు తిరస్కరించుటకోర్వక,

సీ॥ అవిరళమైనకోపమున ♦ నప్పు మహేశ్వరుఁడిమ్మహాధనుః
ప్రవరముఁదాల్చి దేవనిక ♦ రంబుల దోమలనట్లు చేవనూ
పి విఱుగఁజేసి పట్టి బలి ♦ పిల్లలచాడ్పున గొంతుకల్ దెగం
గ వివిధరీతులన్ దునుమఁ ♦ గాగమకించిన భీతచిత్తులై.

చ॥ ''పదియునునాల్గులోకములు ♦ భస్మమొనర్పఁగఁజాలుదంచు వారాహృదయములందెఱింగియు మ ♦ హేశ్వర! నిన్నుఁదిరస్కరించుదు
ర్మదవికలాంధచిత్తులను ♦ మమ్ముఁ గృపామతి నాదరింపవే!
పదములు గొల్చు దాసులను ♦ బాలనసేయుము లోకరక్షకా!

అనిప్రార్థించి "జగద్భయంకరమగు నీమహాధనువును దూరమున నుంచుము. దానిం జూచి మాహృదయములు వ్రయ్యలగుచున్నవి. మేము నీదాసులము. మాక భయమొసంగుము"ని యనేకరీతుల మొఱలిడిన నామహాకాలుండు శాంతించి వారల మన్నించెను. పిమ్మట నొకమారు శ్రీకంఠవైకుంఠులకు విరోధముకలిగి యిరువురును ధనుర్ధరులై మహారోషమునఁ బోరుసేయఁగా దేవతలు ప్రార్థించిన రణము చాలించిరి. అప్పుడు,

క॥ మూవంశకర్తయగు నిమి
భూవరు నాలవతరంబు ♦ పురుషుండు జగ
త్పావనుఁడు దేవరాతున
కావిల్లు నిటాలనేత్రుఁ ♦ డందిచ్చెఁగృపన్.

బహుచందనధూపదీపనైవేద్యము లొసఁగుచు మాపూర్వులమ్మహాచాపమునుఁ బ్రత్యహముఁ బూజించుచుండిరి. అన్వయపారంపర్యముగ నీవిల్లు నాకు వచ్చినది. నేనును దీనినట్లె పూజించుచున్నాను.

మ॥ క్రతువొక్కండొనరింపఁగా మిథిలప్ర ♦ కర్షన్ నాగటిన్ బెట్టి దు
న్నుతఱిన్ లేమయొకర్తుచాలుతుదయం ♦ దున్ బుట్టఁగాఁజూచియా
క్షితి సీతాంతమునందుఁబుట్టుకతనన్ సీ ♦ తాహ్వయంబిచ్చి పెం
చితి నాకన్నకుమారియట్టులు దయా ♦ శ్రీపారమేపారఁగన్.

ఉ॥ ఈరమణీయగాత్రి నిటు ♦ లింటికిఁదెచ్చిననాటనుండి ల
క్ష్మీరమణిన్ బురంబునను ♦ జేర్చినయట్టులు నిత్యసంపద
ల్బారిసుఖంబులున్ శుభము ♦ లున్ బెనుపొందుచునేనెగాక యీ
ధారుణిరాజ్యమంతయును ♦ దారముదంబునఁ దేలియాడెడున్.

అనుపమకల్యాణలక్షణసమన్వితయగునీకన్య శుక్లపక్షబాలచంద్రరేఖవలె వృద్ధినొంది కొంతకాలమునకు యౌవనము నొందెను. అప్పుడు,

ఉ॥ ఈవరకార్ముకోత్తమము ♦ నెవ్వఁడులేపి గుణంబుఁగూర్చి బా
ణావలిఁజిమ్మునో వానికి మ ♦ దాత్మజనిచ్చెదనన్న ధాత్రిలో

మహా — రాజకుమారా! మత్యుత్సాహముతోఁ గార్యమునకుఁ గడంగుము.

చం — అయ్యా! నీయుత్సాహపూరితవాక్యములకు నేనెంతయు సంతసించుచున్నాను. ధనువు నెక్కిడ వచ్చుచున్నాను. [అని ధనువు సమీపించి యెత్తఁబోఁగా నది కదలదు లేచి]

అయ్యా! యీయున్నమాట వచించెదను.

క॥ ఒపలఁగల బలమునంతయు
నడరనునిచి యెత్తఁగా బ్రి, యత్నించిన వ్రే
లెడునంద గలుగలేదిది
కడుభరమగు దీనినెత్తఁ, గాఁ గష్టంబౌ.

(పోయి కూర్చుండును.)

శతా:—

మ॥ అమితంబైన ధనుఃకళాపటిమ బా, హాశక్తియుఁ గల్గియె
ప్పు మహారాజకుమారులందొకఁడు తెం, పుఁ బూని యీకార్ముకో
త్తమముఁ జేకొని నారిఁగూర్చి యిదెసీ, తాకాంతనాకీర్తికాం
తముదంబార గ్రహింపఁగాఁదగదె! లెం, డా! కార్ముకం బెక్కిడన్.

(జయసింహుఁడు నిలుచుచున్నాఁడు)

శతా — జయసింహనృపాలా! విచ్చేయుము. ఓమహాజనులారా!

ఉ॥ ఈపరమేశకార్ముకము, నిప్డు కదల్పఁగ వచ్చుచున్న యీ
భూపతి మాళ్వదేశపతి, భూరిభుజాబలశాలి చాపవి
ద్యాపరమార్గవేది గుణ, ధన్యుఁడునుఁ జయసింహనామకుం
డీపటుశౌర్యరాసి ధను, వెక్కిడనోపు నటంచు నెంచెదన్.

[జయసింహుఁడు ధనువును సమీపించి చూచుచున్నాఁడు.]

శతా— పూనిపట్టుము. చూచుటకుఁ బెద్దదిగ నున్నదే కాని తేలికగ నెత్తఁ గలవు.

జయ—(కన్గొంచి చూచి) ఓసమస్తమహీనాయకకుమారకులారా!

తే॥ పన్నగేంద్రునిఁ బైకెత్తి ♦ పట్టవచ్చు;
బర్వతమునైనఁ బెకలించి ♦ వంచవచ్చు;
ధరణిఁ బూఁబంతివోలె నె ♦ త్తంగవచ్చు;
నీమహేశ్వరుకార్ముకం ♦ బెత్తరాదు.

అయ్యొ! యిదినాతో సాధ్యము గనికాదు. [తనయాసనమునఁ గూర్చుండును]

శతా:—

ఉ॥ ఒక్కరికైన యోటమి మ ♦ ఱొక్కరికిన్ విజయంబు నొందఁగా
నిక్కము దారిసూపునని ♦ నిశ్చయబుద్ధివహించి కార్ముకం
బెక్కిడ యత్నముల్ సలుప ♦ కిట్టుల నిస్పృహులేల? సద్యశం
బెక్కఁగ లేచిరండు; విలు ♦ నెక్కిడుఁడందఱిమెప్పులొందుఁడీ!.

ఓ రాజన్యనందనులారా! యుత్సాహమును విడువకుఁడు. రెండు. ధనుస్సును సమీపించుఁడు.

(అప్పుడు సుమతి లేచుచున్నాఁడు.)

శతా— మహారాజా! రమ్ము. నీవు తగినవాఁడవు. ఓసభాస్తారులారా!

ఉ॥ ఈనరపాలచంద్రుఁడు మ ♦ హీపతులందఱిమేటి యావిశా
లానగరాధినాథుఁడు బ ♦ లంబును శౌర్యముగల్గుదిట్ట వి
జ్ఞాననిధానముల్ సుమతి ♦ నామముగల్గు మహానుభావుఁడీ
శానునివిల్లునెత్తి గుణ సంకలితంబొనరింప వచ్చెడున్.

ఈతనిపూర్వులు నైశాలులందఱును బరాక్రమ శోభితులు. ఇతఁడు నిర్వక్రవిక్రమాంకుఁడు.

సుమతి—[ముందసంజేరి] ఇది రాయెన్వరికిని గదలింపరాని చాపము. రణధీరజయసిం హాదులెత్తఁజాలకున్న నేనుమోపెట్టఁగలుగుదునా? అట్లనుకొని యూరకుం డమనిన నందగత్తియగు సీతపై గాంక్షయున్నదే. అది యూరకుండనియ్యదు. ఏమో నాయదృష్ట మెవ్వరెఱుఁగుదురు? నేఁదాకినంత నీవిల్లు కదలఁగూడ దా? నిరుపమానకీర్తియు సుందరాంగియగు రాజకన్యయు నాకు లభింపఁగూ డదా? ఊరకుండుట మేలుకాదు. ప్రయత్నభాగము మానవునిది. ఫలాఫల ములు దైవికములు. [విల్లునెత్తఁజూచును] ఛీ? యిది కడుభారముగలదని తలఁచియుంటిని. అప్పుడే కొంచెము కదలుచున్నది. ఇఁక నొకక్షణమునకు దీనినెత్తఁగలను. [మఱలఁబూనిపట్టును. వేళ్ళువింటిక్రింద నిఱికికొనును]

అయ్యో! ప్రమాదము ప్రమాదము.

ఉ॥ వ్రేళులు వింటిక్రిందఁబడి ♦ పిండిగనై కడునొప్పియెత్తెడున్
జాలు ధనుఃకళామహిమ; ♦ చాలు స్వయంవరదివ్యసౌఖ్యము
న్జాలును సీతయున్; బ్రతికి ♦ నన్ శుభముబ్బునటంచుమఁదోఁచె; నేఁ
గేలుగదల్పఁజాలఁ; బ్రతి ♦ కింపరె! పిమ్మట మీకుమ్రొక్కెదన్.

శతా—భటులారా! శీఘ్రముగవచ్చి యీమహారాజునకు సాయపడుఁడు.

భటులు—చిత్తము. (అనివచ్చి విడిపింతురు)

సుమ—(మెల్లఁగా లేచి చేతులు పిసికికొనుచు స్వగతము) శక్తికిమీఱిన పనికిఁ బూనువాఁడు పొంగునుఁ దగినశిక్ష లభించినది. (పోయికూర్చుండును)

శతా:—

చ॥ అవనిపులెల్లఁగూడిన మ ♦ హాసభయంట; మహాతపోధన
ప్రవరుల సన్నిధానమట; ♦ బాహుబలాస్త్రకళాసమృద్ధిఁజూ
పి విజయమొందవేళయట; ♦ విశ్రుతరూపవిలాసధన్యయై
న వెలఁదిమిన్నయున్ జయధ ♦ నంబట; లేవరె! విల్లునెత్తరే!.

పరాక్రమసింహుఁ డగు రాజతనూజా! విక్రమముఁజూపుటకిది మంచి యదను. సమయము జారవిడువకుఁడు.

([illegible] ద్యోగము సేయుచున్నాఁడు)

శతా:—

మ॥ భయదాటోపుఁడవై కళింగధరణీశ ♦ బాలించుచున్ శత్రుసం
చయదుర్వారవిహారసారబలతే ♦ జస్సంపదల్ గల్గి సాం
ద్రయశోధన్యుఁడవై చెలంగెదు యశో ♦ ధన్యావనీపాల! వి
స్మయమేపారఁగ విల్లునెక్కిడఁగ ర ♦ మ్మా! మేలుఁ గయ్యెడిన్.

నీవనేక యుద్ధముల నారితేరినవాఁడవు. మహాసాహసాంకుఁడవు. రమ్ము నీకు జయము గలుగును.

యశో — విప్రు లిచ్చిన విజయలాభములు గలుగకున్న మానెఁగాక నాకుఁ బ్రౌఁడు సుబంధిమహీపతికి గలిగిన మేలు గలుగకున్న నేను ధన్యుఁడనే.

శతా — అట్లేటికనుము! నిక్కముగ నీవు జయముఁగాంతువు. రమ్ము.

యశో — ఏమో ప్రయత్నించి చూచెద. (పరికించి చూచి) అయ్యా! శతానందా!

ఉ॥ మేరుమహామహీధరము ♦ మించినదీపెనువిల్లు; లావునన్
భారముగల్గుదీనిని నృ ♦ పాలురు కాదల దేవదానవు
ల్జేరిన నించుకేని గద ♦ లింపఁగఁజాలమి నిక్కమట్టిచో
ధీరుఁడనంచు నేనెటుల ♦ దీనిఁగదల్ప యతింతుఁ జెప్పుమా!

[ధనువును బట్టి చూచి] మహాత్ముఁడవగు నో శతానందా!

ఉ॥ భండనమందు శాత్రవనృ ♦ పాలుర మస్తమురస్త్రధారలన్
గండడగించి మించితిని ♦ గాని జగంబున నెందు నిట్టిబ్ర
హ్మాండమునంతవిల్లు గని ♦ నట్టిది లేదిది పట్టియెత్తఁగా
గుండియ లేదు నాకుఁ బలు ♦ కుల్ పదివేలవి యేల పల్కఁగన్.

[వెళ్లి కూర్చుండును.]

శతా — ఉదాహృదయులగు నో నృపకుమారులారా!

చ॥ ఒకరునిమించియొక్కఁడుమ ♦ హోగ్రబలోన్నతులున్నయీనృపా
లకసభలోన నీధనువు ♦ లావుమెయిఁ బయికెత్తిపట్టి పొం
దికగుణమెక్కఁ దగుల్పఁగల ♦ నేర్పరులుండక పోవరయ్య! పూ
నికమెయి విల్లువంచి తరుణీమణిఁ జేకొనరయ్య! లేవరే!.

మహాబలోపేతులీ రాజసమూహమున లేకపోరు. లెండు. (ఇంచుకతాళి) ఏమి! యొక్కరైనలేవలేదే! నృపకుమారులారా! ప్రఖ్యాతమగు భారతదేశమున నిశ్చలమైన విక్రమముగల వీరుఁడు లేఁడనిన నెంతయు విచారకారణము కాదా? యొక్కవోనిదోస్సారము గల యొక్క రాజకుమారుఁడు తెంపుచేసిన నీకార్ముకము నిలువఁగలదా? లెండు. ధైర్యోత్సాహములు పెంపుఁడు.

రాము: —

మ॥ గరుడుండాభుజగంబుఁ దుండమునఁ జి ♦ క్కంబట్టి ఖండించు నా
కరణిన్ జాపము నెక్కుపెట్టి విఱువం ♦ గానేర్తు నిందున్న భూ
ధరులబ్రంబునుబొంద నీవునుమహో ♦ త్సాహంబునొందన్ మునీ
శ్వర'యాజ్ఞన్ దయసేయుమా! జయముసంప్రాప్తింపదీవింపుమా!

భగవానుఁడవగు నోవిశ్వామిత్రుఁడా! మత్తమాతంగంబుఁజూచిన మృగరాజశాబకమెట్లు విదళింపఁగోరు నాచందంబున నీధూర్జటిచాపముఁ దునియలుసేయవలెనని నాచిత్తంబు త్తలపడుచున్నది. నీవు శ్రద్ధమైనేర్పిన ధనుర్విద్య సార్థకమగునట్లు నాప్రౌఢిమనిచటఁగనఁబఱచెద. అనుగ్రహించి నాకానతిమ్ము.

సీత —(స్వగతము) అసితోత్పలవర్ణుఁడగు నీమహనీయుఁడు నాహృదయము నాకర్షించియున్నాఁడు. ధనువును సమీపింప మునియనుమతి గోరుచున్నాఁడు.

విశ్వా — రామచంద్రా! నీకోరికకు నాకుఁ మిక్కిలిసంతసంబాదవె. హృదయపూర్వకముగ నిన్నుఁబంపుచున్నాను. వెళ్ళి ధనువు నెక్కిడుము.

రాము — చిత్తము.

దశ —(స్వ)అయ్యో! యీవిశ్వామిత్రుఁడూరకుండువాఁడు గాఁడు. గర్వాంభోజాటోపముగల రాజచంద్రులిందఱతోఁగానిపని రామచంద్రునితో నగునా! ఈమునీంద్రు నేమియు ననఁగూడదు. మహాకోపనుఁడు. ఏమిచేయవచ్చును?

రాము — అయ్యా! నేను బ్రయత్నింప వచ్చుచున్నాను.

శతా — రాఘవా! నిన్నుఁ గూర్చి సభ్యుల కెఱింగింపవలయు. ఇంచుక నిలువుము.

రాము — కానిమ్ము. (స్వ) మేఘమువంటి నేనిచటనుండ విద్యుల్లతవంటి సీత దూరమునుండనేల? హరధనువును వంచి శీఘ్రముగ నీమెను గైకొనెద.

శతా — తపఃపూజ్యులగు నోమునిపుంగవులారా! ధరణీశ్వరనందనులారా!

క॥ మునులలరఁ బుత్రకామే
ష్టిని విధ్యుక్తంబుగాఁగఁ • జేసి దశరథా
వనిపతియును గౌసల్యయుఁ
గనిరీతని నఖిలసుగుణ • గణబంధురునిన్.

తే॥గీ॥ కనఁగ నౌనఁగ బాలుఁడైనఁ ద్రి • కాలములను
గలుగు ధానుష్కులను మేటి • గాఁ జెలంగఁ
గలఁడితండంచుఁ దెలుపు ల • క్షణము లెన్నొ
యితని యెడఁ దోఁచు; విల్లునె • క్కిడఁగ నోపు.

రామచంద్రా! రమ్ము. ధనువునెక్కిడుము. లోకంబున నుదారయశంబునొందుము.

సీత — (స్వగతము) పరమ తేజోరాశివగు నీవు ధనువును సులభముగ నెత్తుదువుగాక. నీయిలువేల్పులు నీకు జయమొసంగుదురుగాక.

రాము — (ముందుకువచ్చి) మహేశ్వరుఁడు ధరించుచుండిన యీ దొడ్డవిల్లు దర్శించి నేను ధన్యుఁడనైతిని. (అని ప్రదక్షిణ మొనరించి నమస్కరించి)

మ॥ క్రతువిధ్వంసిధనుర్లతామణిను జ • క్కన్ లేపి మోపెట్టఁగా
శతపత్రాప్తకులుండు రాముఁడు మహో • త్సాహంబునన్ వచ్చె బూ
జ్యతమంబౌ విజయంబు సంధిలఁగ నో • సర్వాస్త్రశస్త్రాధిదే
వతలారా! యిటురండు మీ బలము స • ర్వస్వంబు సాయంబుగాన్.

(అని వంగి ధనువు నెత్తి)

మ॥ కరమందున్ ధరియించితిన్ ద్రిజగదు • గ్రంబైన యీ కార్ముకో
త్తరమున్ మౌర్వి లగింపఁగల్గితి గుణా • ధ్వానంబునున్ జేసితిన్

శరముం గూర్చితి నీడ్చితిన్ దశదిశా • చక్రంబులున్ వ్రీల భీ
కరనాదంబొదవెన్ మహాధనువు ఫ్ర • క్కల్ వ్రక్కలై రాలెడున్.

(విల్లు తునియలై పడుచున్నది. అందఱు జయజయధ్వానములు చేయుచున్నారు.)

సీత—(స్వ) నేను మిక్కిలి ధన్యనైతిని.

శతా—పరమపూజ్యులరగు నో సభాస్తారులారా! యీ రామచంద్రుఁడు జగద్భయంకర విక్రమాభిరాముఁడు.

మ॥ వనజాతప్రభవ ప్రభావుఁడగు వి • శ్వామిత్రమౌనీందు చెం
తను గోదండకళారహస్యముల త • త్త్వంబంతయున్ నేర్చెఁ బె
ల్చన శస్త్రాస్త్రవితానమియ్యనఘు నా • జ్ఞాబద్ధమై యొప్పు చె
ప్పిన నట్లుండు; స్వతంత్రుఁడీతఁడు ధను • ర్వేదంబు సర్వంబునన్.

మ॥ కమలాప్తాన్వయుఁడైన యీ ఘనుఁడు లో • కశ్రేణికిన్ బాధఁ గూ
ర్చి మునుల్ చేసెడు జన్నముల్ చెఱచు మా • రీచున్ దదీయానుజ
న్ముఁ బఱిన్ వారలతోడి రక్కసులను • న్మూలించి యీ భూమిభా
రముఁ జాలంగ నడంచె నొక్కఁడు మునీం • ద్రశ్రేణుల గ్గింపఁగన్.

క॥ సముదగ్రవరదేంద్రము ప
ద్మము నాళముఁ బట్టి యుత్క • టముగ విఱుచు నా
క్రమమున నీ యీశ్వరు వి
ల్లు మహాభుజుఁడితఁడు ద్రుంచె • లోకము మెచ్చన్.

శ్రోతల కర్ణపుటంబులు చెదరి బధిరీభూతమగునట్లు భయంకరనాదముతో మహాదేవుని శరాసనము విఱిగి కుప్పఁ గూలఁబడియె. రామచంద్రా! నీవు జగదేక ధనుర్ధర ప్రవరుఁడవు. ఈ విజయమునకై నిన్నుఁ దొలుత నేనభినందించుచున్నాను. (అని చేతులు గలుపును.)

రామ—అంతయు నాగురుల కటాక్షము. (రాజులు నిష్క్రమించుచున్నారు.)

జన—సారథ సర్గ్భంగముతో స్వయంవరకార్యము ముగిసినట్లే. (దశరథునితో)

మహారాజా! నీకుమారుఁడు సర్వజ్ఞుని విల్లు విఱిచె. నాసుత సీతాదేవిని నీకోడలుగఁ జేసెద. దయతో ననుమతింపుము.

దశ — జనకమహారాజా! మనము చిరమిత్రులము. నీవియ్యంబు నాకుఁ బరమసంతోషజనకము. అవశ్యము చేయుదము.

జన — మిత్రుఁడా! యిది మిక్కిలి సుదినము. ఈరామచంద్రుఁడల్లుఁడుగా నీనెయ్యంబు వియ్యంబుగా సకలసద్గుణకల్య కౌసల్యతోఁ బుట్టువుగాఁ బడయఁ గనుట మహాభాగ్యమని తలంచుచున్నాను. వివాహము మిథిలయందు జరుగునట్లనుమతింపవలెను.

దశ — ఈవిషయములన్నియు నీవు మహాత్ములగు వసిష్ఠవిశ్వామిత్రులతో నాలోచించి యెట్లనుకూలమో యట్లు చేయుము.

వసి — మీకిరువురకును నెయ్యమునకుఁ దోడు వియ్యమును గుదురుట లోకసమ్మతము. వివాహము మిథిలానగరముననే జరగనిమ్ము.

జన — ధన్యుఁడను. అమ్మాయీ! సీతా!

చ॥ హరునిమహాశరాసనము ♦ నందఱుమెచ్చఁగ నొక్కలీలమై
విఱిచెఁ బటుప్రతాపగుణ ♦ విశ్రుతుఁడీ నృపనందనుండు నీ
కరముగ్రహింపనర్హుఁడటు ♦ గావున నీతనికంఠసీమ సుం
దరమయిమెప్పునీకుసుమ ♦ దామము వైచి నమస్కరింపుమా!

(హారము నొసంగును)

సీత — [సిగ్గున హారము రామునికంఠమున వైచుచున్నది. అందఱు జయజయధ్వను లొనరించుదురు.]

జన — [వసిష్ఠునితో] మహాత్మా! మఱియొక విన్నపము.

వసి — అవశ్యము వివరింపుము.

జన — ఈసీత భూపుత్రి సవనమునకై దున్నునప్పుడుద్భవించెనని మనవి చేసికొంటిని. నాకూతురూర్మిళ యొకకన్య కలదు. పరిణయయోగ్యయైన యూర్మిళను లక్ష్మణకుమారుఁడు భార్యగాఁ బరిగ్రహింపవలెనని కోరిక.

వసి — మిక్కిలి శ్రేష్ఠమైన పని. ఏమి దశరథా!

దశ — నాకుఁ బరమసమ్మతము. నాదియు నొకచిన్న కోరికగలదు. జనకునిసోదరుఁడగు నీకుశధ్వజునకుఁ బుత్రికలిరువురు గలరు. వారలను భరతశత్రుఘ్నుల కిచ్చునేవాయని.

జన — పరమసంతోషముతో నొసంగఁగలఁడు.

వసి — సరి. నాలుగువివాహములొకటిగ జరుగుఁగాక. నేటికైదవదినమున మంచి ముహూర్తము గలదు. అప్పటికయోధ్యనుండి రావలసినవారందఱుఁ గూడ వత్తురు.

జన — నీవును గాధేయుఁడు నయోధ్యామిథిలాపురంబులకుఁ గర్తలు. ఈపదిదినములిచట నిలిచి మాకు సంతోషముఁ గూర్పఁగోరెద.

వసి — అట్లే కానిమ్ము.

విశ్వా — అందఱును విడుదులకు విచ్చేయుదము.

(నిష్క్రమించుచున్నారు.)

చతుర్థాంకము.



# సీతాకల్యాణము.

## పంచమాంకము.

[మిథిలాపురమువీథిలోనయరుఁగు—గంగాధరశాస్త్రిపరుండియుండును.]

అయ్యో! బాధ. బాధ. తాళఁజాలను. ఈజనకుఁడెప్పుడన్నదానము చేసినను బ్రాహ్మణులకుఁ దీఱని బాధయే. భుజించినప్పుడు తోఁపలేదు. కాని యిప్పుడు ప్రాణకంటకముగ నున్నది. ఇంకను దక్షిణలొకటిరెండు మాడలెక్కుడు గనిచ్చినను గష్టమనిపించదు. కాని యీభోజనములతో నేమిసుఖము? కుడిచి నాలుగుగంటలైన నింకను గడుపుబ్బరము సడలలేదు. ఎవ్వరైనఁ గొంచెము చేయూఁతనొసంగినఁ గూర్చుండుదును. ఓరిమాధవా!

[దూరమున మాధవుఁడు] స్వామీ! యిచ్చటనున్నాను.

గంగా—అచ్చట నేమిచేయుచున్నావు? ఇటురమ్ము.

మాధ—మీయొద్దకు రావలెనని యొకగంటనుండి ప్రయత్నించుచున్నాను.

గంగా—(ఆత్మ) వీఁడు పొట్టపగులునట్లు భుజించియుండును. (ప్రకాశము) త్వరితముగ రమ్ము.

మాధ—[వచ్చి] స్వామీ! యేమియాజ్ఞ?

గంగా—కూర్చుండి కొంచెముసేపు కాళ్ళు పిసుకుము.

మాధ—ఉన్నమాట విన్నవించుకొనెదను. మీకెట్లో వీలుచేసికొని పండుకొనఁ గలిగితిరి. నాకుఁ గూర్చుండుటే సాధ్యముగాకున్నది. దయచేసి మీరు నాకు సాయముచేసి కూర్చుండఁబెట్టినఁబిదప మీకాళ్ళు పిసుకయత్నించెదను.

గంగా—ఛీ! వెధవా! నీయెగతాళిమాని కాళ్ళు పిసుకుము.

మాధ—ఎగతాళికాదు. కూర్చుండుటకు శక్తిలేక యోగదండానుకొని నిలుచుండియే యాయాసముఁ దీర్చికొనుచుంటిని.

గంగా—పోనీ కొంచము చేయూఁతజేసికొని లేచెదను. నాదండ మెచ్చటనున్నదో చూడుము.

మాధ—స్వామీ! మెడవంగదు. దండమాకాశమార్గమున నెచ్చటను గనఁబడలేదు.

గంగా—భ్రష్టా! కొంచెము తక్కువగఁ దినఁగూడదా?

మాధ—దేవా! మీరెట్లో నేనట్లే చేయవలదా? "యథారాజాతథాప్రజా". మీరా పూర్ణముగ భుజించినప్పుడు నేనట్లుచేయనేని శక్తివంచనచేసితినని మీతో మాటవచ్చునని యెట్లో కష్టపడి పనిచేసితిని.

గంగా—నీకేమి పిల్లకాయకు? ఎంతభుజించిన నేమి సేయును? ఒకటిరెండుపనసలు చెప్పుమంతయూ పరిపోవును. ఏదీ! చమకము ప్రారంభింపుము. "హరిః ఓం అగ్నావిష్ణూ సజోషసేమా వర్ధంతు వాంగిరః" కానీ.

మాధ—నన్నుఁగొనిపోయి కొట్టున వైచిన నొక్కసూక్తమైన నిప్పుడు నాతోఁ గాదు. కావలసిన మీరు చెప్పుచుండుఁడు. నేనూరక వినుచుండెద.

(సమీపమున విష్ణుశర్మ ప్రవేశించి)

శ్లో॥ అగస్త్యంకుంభకర్ణంచ శమ్యంచబడబానలం
ఆహారపరిణామార్థం స్మరామిచవృకోదరం.

గంగా—ఎవరురా మాధవా! వృకోదర ప్రార్థనము చేయుచు వచ్చుచున్నారు?

విష్ణు—ఓహో! గంగాధరశాస్త్రిగారా? స్వామీ! నమోనమః

గంగా—విష్ణుశర్మగారే! రండు. జరగరా మాధవా! పోయి యొకచాపచింపి నిప్పించుకొని రమ్ము.

—అయ్యా! వలదు. వలదు.

గంగా—వెళ్లవలెనా? కొంచెము సేపు కూర్చుండరా?

విష్ణు — అది సాధ్యము గాకున్నది. ఈవారము దినములనుండి మనకడుపులయఁ గలిగిన పనియెట్టిది?

గంగా — యిప్పుడు మనసుకు వచ్చినది. నా యవస్థమాత్రము బాగుగనున్నదా? ఉదయమునుండి యిప్పటికరపడి సోమము దినియుందును. గుణమావంతయుఁగనుపింపలేదు. అట్లుగాకున్న మీరుపెద్దలు. అయ్యో! మీరువచ్చి మాటాడింపఁగా లేచికూర్చుండక పరుండియుందునా? మీరును గొంచె సోమముఁ బుచ్చుకొనెదరా?

విష్ణు.— అయ్యో! యొక్క సోమముఁ బోఁచకు సందుండిన నొకచేరెడు పోశ్లీల చెల్లయిన లోపలికిఁ గ్రుక్కియుందును. ఈవారమునుండియు డీఅని యజీర్ణబాధ గలిగియున్నది.

గంగా — ఏమో వడ్డించినప్పుడు వంచన సేయలేము. పిదప జీర్ణించుకొనలేము. ఏమి చేయవచ్చును? ఈయజీర్ణబాధ దేవతలనయిన వదలునదికాదుగదా? ఇఁక మనమాట యేమి?

విష్ణు — దేవతలమృతాహారులే. వారి నజీర్ణము బాధించునా?

గంగా — అమృతము సామాన్యముగా జీర్ణమగునది కాదు. అందువలన దేవతలనవరతము బాధపడుచున్నారు. బ్రహ్మ యజీర్ణరోగపీడితుఁడై కష్టపడఁజాలక కడఁకు బంగరు దినియున్నాఁడు. అందువలన నతనికి హిరణ్యగర్భుఁడను పేరుగలిగినది. విష్ణుండుష్ణకరముగనుండునని లక్ష్మీదేవిని వక్షమున ధరించియు గరుడనిపైనెక్కి యాకసమున సంచరించి నిర్వాయుభక్షణము చేసియుఁ బడరానిపాట్లు పడుచున్నాఁడు. ఈశ్వరుఁడీబాధకుఁ గైలాసమున నిలింపఁజాలక స్మశానమున నగ్నిసమీపమున వసించి బూదిఁబూసికొని యెల్లప్పుడు నెత్తిననీళ్ళుంచుకొని పాషాణభక్షణము చేయుచున్నాఁడు. ఇఁక దిక్పాలురవిషయముఁ బరికింపుఁడు. దేవేంద్రుఁడెప్పుడు నజీర్ణరోగియై కరమున వజ్రాయుధము ధరియించి యుచ్చైశ్శ్రవము నెక్కి యెట్లో కాలము గడపుచున్నాఁడు. అగ్నిదేవుఁడోషధులనెల్ల భక్షించుచు వెండి బంగారమినుము లోనగు లోహముల మైత్రితో సన్మిటలక్రిందఁబడి కాయశుద్ధి నొందుచున్నాఁడు. యముఁడెప్పుడును మృత్యువుచే జేఁబాల్చిరో యుండును. నైఋతియు నీవ్యాధి తీఅదని పిత్తుపతియై యున్నాఁడు. వరుణుఁడు బహుబాధపడుచు

శాస్త్రయించి జలములను విడచి తపముసేయుచున్నాఁడు. వాయువొక్కఁడేఁగా లునిలుపక యూరక తిరుగాడి శరీరవ్యాయామము నొనరించుచుండును. ఇట్లే చూచిన నజీర్ణబాధలేనివాఁడు దేవతలలో నొక్కఁడుతేఁడు. అందఱికన్న బ్రహ్మవిషయము చాలశోచనీయము. ఈవ్యాధిచే నతఁడు మిక్కిలిదుర్బలుఁడైయున్నాఁడు. అందుకే విష్ణ్వీశ్వరులకన్న నెంతయో పిన్నవాఁడైనను దేవతలతనిని "దాత తాత" యని పిలుచుచుందురు. బ్రహ్మేంద్రాదులను గూడ విడువని యీయజీర్ణబాధ మనలను విడుచునా?

(అప్పుడింటి యజమాని ప్రవేశించి)

యజ—ఏమివ్వరాపండుకొనినవారు? బ్రాహ్మణులా?

గంగా—అవునండీ. శ్రాద్ధమో తర్పణమో చేయింపవలసియున్న సెలవిండు. అవశ్యము వచ్చి నెఱవేర్చెదము. అయ్యా! మీరెవరు?

యజ—నేనీయింటివాఁడను.

గంగా—అలాగా? విచ్చేయుఁడు. ఎచ్చటికి వెళ్ళియుంటిరి?

యజ—జనకునింటికి. ఈదినము దశరథుఁడుపాధ్యాయుఁ బయనించెను. దక్షిణకై పోయియుంటిని.

గంగా—అప్పుడే యిచ్చిరా?

యజ—ఆఁ. యిచ్చిరి.

గంగా—అయ్యో! చెడితిమి. ఓరిమాధవా! ఇంకనైన లేవరా దక్షిణలేటఁగలిగినవి!

మాధ—కొంచెము తాళిపోదములెండు.

గంగా—అవశకునపుఁబక్షీ! దక్షిణలెగిరి పోయినవటరా! ఆలస్యముచేయకుము. పాదంపము వెదకుము. అయ్యో! భగవంతుఁడా!

యజ—ఇప్పటికి దశరథుఁడొక క్రోసెడుదూరమేగియుండును.

గంగా—ఓరీమాధవా! త్వరితముగఁబోవలెను. అనఁగాఁ బరువెత్తవలసినదే. బ్రాహ్మణుఁజూచిన రాజులుతిరస్కరింపలేరు. ఏమోసగపాలైన లభించినఁజాతము.

విష్ణు—అర్ధభాగమునకుఁ జావులేదు.

(అందఱునిష్క్రమించుచున్నారు.)

—)ఇది విష్కంభము.(—

## పం చ మాం క ము.

### మిథిలాపురపరిసరము.

---

జనకదశరథులు, వసిష్ఠవిశ్వామిత్రులు, రామలక్ష్మణులు, పరివారము బయనించుచుందురు.

జన:—

సీ॥ కదలంగఁబోయి వె ♦ న్కకుఁజూఁగి తనసాఁకు
మృగశాబకమ్మునె ♦ మ్మేనునిమురు;
పేర్వోసి పెంచి పం ♦ దిరులకల్లించిన
యొలదీవియలనన్ని ♦ కలయఁజూచు;
క్షణమైన నెడఁబాటు ♦ గనకయుండిన చెల్మి
నెలతలఁజేరి క ♦ న్నీరునించు;
దీనాననమున చే ♦ తెంచి "పోవలయునే?
కన్నయ్య!" యనినన్నుఁ ♦ గౌఁగలించు;
తే॥గీ॥ నడుఁగు ముందునకిడ హృద ♦ యంబు వెనుక
కరుగ వెలవెలఁబోయి యం ♦ దఱనుజూచుఁ;
దాను పెఱిఁగినమమత సీ ♦ ధరణిజాత
యిచోటువిడలేక మీవెంట ♦ నేగలేక.

మహారాజా! యూర్మిళ నాస్వపుత్రికయగుటను మాండవీశ్రుతకీర్తులు నాసోదర తనూజలగుటను మువ్వురను నేను సమానప్రేమ నీక్షించుటను నాతనయ లనందఱు నీవేమఱక యాదరింపవలెనని నేనెంతకోరుచున్నను సీతాదేవి విష యమై మాత్రము నేను పదింబదిగఁ జెప్పవలసియున్నది.

దశ:— రాజర్షిచంద్రా! నీవిసుమంతయు విచారింపకుము. నీసుతల నలువురనస్మాముం

దుగ నరసి పిదప నాపునర్భులఁజూచెద. పెద్దకోడలౌట సీతను నేనెప్పుడు శిరమున వహించి యాదరించుచుండెద. సీతనయ భూజాత నీయింట నీయొడిలో నున్నదనిగా భావింపుము.

జన—నీవును నీకుమారులు నుదారగుణములుగల మృదుహృదయులని నాకుఁగల నమ్మకమే యిప్పుడు ధైర్యముఁగూర్చుచున్నది. (రామునిఁజూచి) రామచంద్రా! నీవు మహారాజకుమారుఁడవు. ధర్మశాస్త్రములెఱింగిన బుద్ధిమంతుఁడవు.

మ॥ నవనీతమ్మునకన్నఁగోమలము స్వాం ♦ తంబన్ని కార్యంబులన్
భవదాజ్ఞన్ దలఁదాల్చు; నీవనుమతిం ♦ పన్ బోని యేమాటకున్
లవమైనన్ జెవియొగ్గఁబోవని గుణా ♦ లంకారభాసీత; ప్రే
మవిశేషంబున నెట్లు తేలెదవొ రా ♦ మా! యీవధూరత్నమున్!.

సీతతో విశేషించి చెప్పవలసినదిలేదు. ఆమెసౌఖ్యమే నాసౌఖ్యమని మాత్రము నీవు జ్ఞప్తియుంచుకొనినఁజాలును.

రామ—అయ్యా! యుదాత్తప్రవర్తనముగల వాఁడును నేకపత్నీవ్రతుఁడును నగు నాయకుఁడు తనవిధేయధర్మపత్ని నెట్లు చూడవలయునో యట్లు నేను సీత నేలెదను. నీవు విచారము మానుము.

జన—(సీతతో) ప్రాజ్ఞురాలవగు నోభూతనయా!

తే॥గీ॥ దశరథుఁడు కూర్మిఁగలుగు చి ♦ త్తంబువాఁడు;
కోసలాత్మజ కడుదొడ్డ ♦ గుణముగలది;
పతి దయాళుఁడు; దిగులొంద ♦ వలవదమ్మ;
శీఘ్రముగవత్తు; నిన్నుఁ బి ♦ ల్చికొనివత్తు.

సీత—(తండ్రినిఁ గౌఁగలించుకొనుచున్నది-)

దశ—బావా! మేము పయనించెదము,

జన—నాకిఁక సెలవు. (నిష్క్రమించుచున్నాఁడు.)

వసి—ఇఁక నాలస్యమేటికి? అందఱును రథదంతివాహముల నధిరోహింపుఁడు.

ఈదినము సాయంతనమునకెల్లయు నయోధ్యాపురిఁ జేరవలయును.

దశ—కుమారులు గజాశ్వములఁ నెక్కుచున్నారు. మనము రథము నారోహింతము.

వసి—మంచిది. విశ్వామిత్రా! రమ్ము. (అందఱు నెక్కుచున్నారు)

విశ్వా—

మ॥ అనురాగాతిశయమ్మునన్ దనదు గేహంబందునన్ జేర్చి పెం
చిన వాత్సల్యముతోడ సీతవెనుకన్ జిత్తంబు రాఁ బల్మరున్
నతనపత్రిక్కన్ మొగమెత్తి చూచి మిథిలన్ డాయంగఁ జోకేకయా
జనకుండేగతి నిల్చుచుండెనొ వసిష్ఠా! చూచితే? దవ్వులన్.

వసి—అవును. జనకుఁడు మిక్కిలి విచారముతో నున్నాఁడు. ఊర్మిళయందుకన్న సీతయందతనికనురాగ మెక్కుడు.

దశ—అనుపమపాత్రిశసంపన్నుఁడవగు నీవెంట రామలక్ష్మణులను గొన్నాళ్ళపంపుటకే నేనెంతయో విచారమునొందితిని. బాల్యమునుండి పెంచిన బిడ్డలను బరులకుఁ బట్టి యీయవలసినప్పుడు జనకువిచారమునకు మేరయుండునా?

[పరివారము కలఁత నొందుచున్నది]

దశ—ఏమిది? రథవర్గములు ముందునకుఁబోక నిలిచినవి. హయములు బెదరి పదవెత్తుచున్నవి.

సేనాధిపతి—దేవా! వికటభ్రుకుటీభయంకరుఁడై మున్ముందొకపురుషుఁడు గంభీరాకారుఁడై పరశువు నొకవాడ్డవిల్లును ధరించి వచ్చుచున్నాఁడు. అతనిఁ జూచి రథులు జడిసిరి. హయములు బెదరినవి.

దశ—పరశురాముఁడా యేమి?

వసి—కావచ్చును. ఆపరశువు మఱెవ్వఁడు ధరించును?

దశ—అయ్యో! యిఁక మాకేదిగతి? మహోన్నతపర్వతశృంగమునుండి మృగంబులపై దూఁకవచ్చెడు పంచాస్యముచందమున నితఁడు నిలఁబడినాఁడు.

ఉ॥ కడుబలశాలియాతఁడు; జ ♦ గత్త్రయముం గజయించె క్షత్రవచ్చినన్
దడఁబడఁడించు కేనియును; ♦ ధారుణినాయకుఁడన్నమాత్రఁ బైఁ
బడితలఁదీయు; నాకటికి ♦ వానికిఁగల్గినఁ గల్గుఁజాలి; ప్రా
రుఁడయినఁదీవ్రకోపి; యెవ ♦ రుం జనరీతనిమోము డాయఁగన్.

కానకకన్న యీనలువురుపుత్త్రులకు వివాహములుచేసి రాజ్యపాలనమున నియోగించి నేను విశ్రాంతి ననుభవింతునని కొంతంత యాసతో నుండఁగాఁ బెండ్లిండ్లయి మఱల నయోధ్యఁజేరకముందె మృత్యుదేవతవలె నీపరశురాముఁడడ్డము రావచ్చునే? పుత్త్రులను నన్నుఁజూచిన నతఁడూరక విడుచునా? దాక్షాధ్వరధ్వంసమునాటి మహేశ్వరుని చందంబున నతఁడు మాపై గవిసినప్పుడు మహాత్ములారా! మాకేదిదిక్కు? నాగుండియ నీరై పోవుచున్నది. ఇదియెట్టి దుర్దినమా?

సి — దశరథా! రాజులఁ జూచిన నత్యంతకుపితస్వాంతుఁడయ్యెడు వాఁడైనను పరశురాముఁడన్యాయముగ వర్తించువాఁడుగాఁడు. అందునను నీవహింసాపరుఁడవు. నిన్నతఁడు కోపమునఁ జూడఁడని నానమ్మకము. సమీపించినపుడు విధేయుఁడవై మెలఁగుము. అతఁడు కరుణఁజూచును.

ద — మహాత్మా! నీవు పొరపడుచున్నావు. రాజశబ్దము చెవిసోఁకినంత వెదకికొనివచ్చి కసాయి గొఱ్ఱెలను నఱకునట్లు పడవైచి కంఠముదీయు పరశురామునకు మాపైఁ గరుణగలుగునా? అయ్యో! యింతతెలియనైతివే!

తే।గీ॥ సంద్రదగొడ్డంటఁ దనతల్లి ♦ కంఠమవని
వ్రాలనఱకిన యతఁడేడ? ♦ కరుణ యేడ?
వెదకి తలఁద్రుంచువానికిఁ ♦ బిన్నతల్లి
చావులు బీరపూలనుచు వ ♦ చింపవినవె?

తప్పక యింకా వాఁడు ప్రశ్నయము జరగును.

సి — దశరథా! జామదగ్న్యుఁడు సమీపించియున్నాఁడు. ఎదురేగి యథార్హవి

దశ—స్వయముగా నాకేమియుఁ దోచుటలేదు. నీవానతిచ్చినట్లు మెలంగెద. ఏ ట్లోపమున్నఁ గాపాడుట నీభారము. విశ్వామిత్రమునీంద్రా! నీవు రావా?

విశ్వా—రానా మరి? అందఱమునుబోయి సత్కరించుదము.

[ప్రవేశము పరశురాముఁడు]

వశి—నారాయణస్వరూపుఁడవైన నీకు సుస్వాగతము. నీదర్శనభాగ్యము గలిగిన యీదినము మిక్కిలి సుదినము.

పరశు—ఓహో! వసిష్ఠులువచ్చినట్లున్నదే! ఆనందమానందము.

విశ్వా—నీదర్శనము సాక్షాద్విష్ణుదర్శనము.

పరశు—విశ్వామిత్రుఁడా? అందఱు మిథిలనుండియే కదా వచ్చుచున్నారు?

విశ్వా—అవును. అయోధ్యకే ప్రయాణము.

దశ—దేవా! భార్గవరామా! నీకు వందనసహస్రములు. భక్తులపాలిఁటి కల్పవృక్షమవై ప్రపంచమున బ్రాహ్మణప్రవరుఁడవై జనియించిన మహావిష్ణుఁడవు. నన్నుద్ధరించుటకే నీవిందువచ్చితివి. విధేయసేవకుని మన్నించి యర్ఘ్యపాద్యముల గ్రహింపుము.

పరశు—దశరథా! నీచేయు సపర్యలు నాకువచ్చినవి. సంతోషించితిని. నాకవ్వానితోఁ బనిలేదు. నీతోడను నాకిప్పుడు కార్యములేదు.

క॥ హరువిల్లును విఱిచిన నీ
వరసుతుఁడా రాముతోడ ♦ ద్వంద్వరణంబు
ధరగతి నొనరింపఁగ నే
నరుదెంచితి నిటకు దశర ♦ థావనినాథా!.

నేను వచ్చినది నీకుమారునికొఱకు. ఏడీ శ్రీరాముఁడు? అతఁడెట్టివాఁడు? ఎందున్నవాఁడు?

దశ—[స్వ] అయ్యో! పెద్దపిడుగు పడెనే. దేహమాపాదము వడఁకెత్తుచున్నది.

రాము—(స్వగతము)

మ॥ అమరేంద్రాదుల మించు రూపవిభవం, బాజానుదీర్ఘంబులై
నమహాబాహులు రాజసప్రభలు నిం • డన్ వెల్గు నెమ్మోముఁగ
ల్గిమెఱుంగొందు నితండు లోకములఁ బ్రా • లింపన్ దగుం గాక సం
యమిగా నుండఁదగండు నిశ్చయ మప • ర్ణాధీశ్వరున్ బోలెడున్.

(అని పరశురాముని సమీపించి ప్రకాశము.)

మ॥ దివిషన్నాయకులే మహామహులని శ • క్తిస్ఫూర్తులూహింపలే
గవనీశాళిక కాలమృత్యువగు నే • యాచార్యనామంబు గా
రవభాగ్యాంకము వేనిపుట్టువగు వి • ప్రశ్రేణి కావిష్ణునా
రవరూపంబగు నీపదాబ్జములఁ జే • ర్పన్ గంటి నాశీర్షమున్.

(అని నమస్కరించి) మహావిష్ణుని యారవయావతారంబని జగంబులు వేనోళ్ళఁగొని
యాడు నీదర్శనము లభించుట భాగ్యమయదేవత ప్రసన్నమైనట్లు. నిరుప
మానధారాళతేజోరాశివగు నీవు భువనవంద్యుఁడవు.

దశ — భగవానుఁడనగు నో రేణుకానందనా!

ఉ॥ ఈకొమరుండె రాఘవుఁడ • నేకమహాగుణరత్నరాశి యి
క్ష్వాకుకులప్రభూతులకుఁ • బ్రాణము మించిన ప్రాణ మార్యసే
వాకుశలుండు లోకహిత • వర్తనశీలుఁడు విప్రులన్న న
స్తోకము భక్తిసేయు ముని • ధూర్జటిగాధికుమారుశిష్యుఁడున్

చంద్రశేఖరు శరాసనము నెట్టులో విఱిచెననుటయేకాని వీనికి ధనుర్విద్య యేమి
యుఁ దెలియదు. జగద్భయంకర స్వరూపుఁడవగు నీయెదుట నెట్టివీరులైన నిలు
వఁజాలరు. బాలుఁడగు రాముఁడు నీతోఁ గయ్యమునకియ్యకొని నిలువఁగలఁ
డా? నీపరశుధారలకు సైఁపఁగలఁడా? దుర్వార భయంకర హర్యక్షరాజంబు
ప్రోల హరిణశాబకమేమి బింకముఁ గనఁబఱచును?

క॥ ధారుణీనాథవధంబున్
వారక చేయుచు మహేంద్రు • ప్రార్థనమున నా

క్రూరతమానితివింకే
లా! రామునితో రణంబు ♦ నడిగెదు దేవా!.

కార్తవీర్యార్జునునియెడఁ గోపంబువోదమి వాఁడట్లు చేసితివి కాక దేవా! నీహృదయము క్రౌర్యమున నెట్టిదో యెఱుంగదే! అనపరాధుఁడగు రామునితో రణము నభిలషింపనేల? వీఁడు నీకు శరణాగతుఁడు, నీవు శరణాగతత్రాణ బిరుదాంచితుఁడవు.

సీ॥ మునికులాలంకారుఁ ♦ డని జగంబులు మెచ్చు
జమదగ్నిమునికిఁ గూ ♦ రిమిసుతుఁడవు;
జగములన్నియు సర్వ ♦ సంహారమొనరింపఁ
గలిగి శాంతుఁడవైన ♦ ఘనగుణుఁడవు;
ధరణీతలంబు నం ♦ తయుఁ గశ్యపునకును
దానమిచ్చిన మహో ♦ దాత్తమతివి;
త్రిజగంబులేలు శ ♦ క్తినిగల్గి సర్వంబు
వదలి తాపసుఁడవౌ ♦ పావనుఁడవు;
తే॥గీ॥ నేను వృద్ధుఁడఁ; బెక్కేఁడు ♦ లిడుమపడిన
వాఁడ; నన్యథాగతిలేని ♦ వాఁడ; నీప
దములకెఱఁగినవాఁడఁ; జి ♦ త్తంబుకఱఁగి
పుత్రభిక్షనొసఁగి నన్నుఁ ♦ బ్రోవవయ్య!.

నీపదంబులపైవ్రాలెద. పాలముంచినను నీళ్ళముంచినను నీవేదిక్కు. నాకులమునుద్ధరింపుము. నాకభయమొసంగుము.

పరశు—దశరథా! లెమ్ము. నన్నుఁజూచి నీవు భయపడితివని నామనస్సునకు వచ్చినది. కాని నీవేమియు భయపడవలసినదిలేదు. నిన్నుఁగాని నీయితరకుమారులనుగాని మఱియెవ్వరినైనఁగాని నేనేమియుఁజేయవలెనని వచ్చినవాఁడను గాను. నేను రామునిఁజూడవచ్చితిని. అతనియెడఁగల వాత్సల్యవశము

న సిప్రుఁడు భయపడెదవే కాని రాముఁడేమియు భయపడఁడు. రాముఁడు మంచి వీరుఁడును ధనుర్ధరుఁడును గావలయును. మఱియు నీశ్వరు శరాసనము నెవ్వరు నెక్కిడఁజాలరు. అట్టి దొడ్డవిల్లు విఱిచినందుననే యతని ధనుఃపాండిత్యమెంతటిదో చూడవలెనని నేనింతదూరము వచ్చితిని. ఇంకొక విశేషాంశము గలదు.

మ॥ తనపేరాసిని గన్నయట్టి యొకవి ◆ ద్యన్ వేఱొకం డెంతయే
ర్పునుసంపాదన సేయ నట్టివిషయం ◆ బున్ విన్నతో స్త్రోడ నా
ఘనుఁ జేరంజని వాని విద్యఁ గనుదాఁ ◆ కన్ ధీరుఁడై వానికిన్
గనులన్ మూసిన నిద్ర రాదు; మొసవం ◆ గాఁ గూడ సహ్యంబగున్.

కావున నీవు నాకడ్డుచెప్పవలసిన యావసరములేదు. [అని ముందుకువెళ్ళి రాముని పరిహసించి]

రామా! మిథిలానగరమున జనకుఁడు తనకూతురి వివాహము చేయఁగోరి స్వయంవరము చాటఁబంచుటయూ నచ్చటికనేకులు రాజకుమారులు వచ్చుటయు వారలలో నొక్కఁడును మహేశ్వరుని మహాకోదండంబు నెత్తఁజాలకపోవుటయు నీవద్దాని నెక్కిడి త్రుంచుటయు లోనుగాఁగల విశేషములు నేను మహేంద్రాద్రియందు వింటిని. సంతోషించితిని. నీవెట్టి ధనుర్ధరుఁడవో చూడఁగోరి యిటకరుదెంచితిని. నీతండ్రి వచించినట్లు నేను పెక్కురరాజుల వధించి యింద్రుని ప్రార్థనమున నాకార్యమునుండి విరమించితిని. నాకుఁగల సమస్తసంపదను గశ్యపాదులగు విప్రులకు వదలి సర్వత్యాగమొనరించి వల్కలాజినములు ధరించి తపము సేయుచున్నాను. అట్టి నాకుఁ నీతో నిప్పుడేకార్యమును లేదు. కాని యీధనువును గుఱించి యొకించుక పూర్వగాథగలదు. అది తెలిసిన నీకంతయు విశదమగును. ఎఱుంగఁగోరుదువేని తెలిపెద.

రాము — దేవా! నీతో మాటాడి నూతనవిషయములు తెలిసికొనఁగలుగుట నాకుఁబరమభాగ్యము. అవశ్యమాపూర్వగాథ యానతిమ్ము. విని ధన్యుఁడ నయ్యెద.

పరశు — అట్లయిన సావధానుఁడవై వినుము.

చ॥ తనవరశిల్పకౌశలము • తక్షకవంబడ విశ్వకర్మ తా
మునుపాకనాఁడు మోదమునఁ • బూర్ణబలంబునొప్పి పొ్సగ
ల్గిన యొకరెండువిండులను • లీలసృజించెను; వానిలో మహే
శునకొకఁడుఁగా మఱొండుమధు • సూదనునకుఁగా దగనిచ్చె భక్తిమై.

హరిహరులాకోదండంబుల మోదంబునఁగొనిరి. ఈశ్వరుఁడావిల్లుధరియించి త్రిపురాసురాదులపైకేగి యనక్రవిక్రమమున వారల నాఱుమాడెను. విష్ణుండును మాల్యవదాదిదైత్యుల ననేకులఁ గుదముట్టించెను. రాక్షసవధమొనరించుటలో విష్ణ్వీశ్వరులిరువురు నసాధారణశక్తితోఁ బనిసేయుచుండుటఁజూచి వారిరువుర నెవ్వఁడెక్కుడు బలవంతుఁడో యని తెలిసికొనఁగోరి దేవతలు తమకోరికను నారదునకెఱింగించుకొనిరి. కలహమునకు సూత్రధారుఁడైన నామునీంద్రుఁడును,

తే॥గీ॥ హరుఁడు గర్వించెనని చెప్పి • హరిని లేపి
హరియు గర్వించెనని చెప్పి • హరుని లేపి
యాసుఁగ్రోవివలె నిచట • నచటఁదిరిగి
హరిహరులకీర్ష్యరకుఁ బగ • యడరఁజేసె.

ఇట్లంకురించినవైరము దినదినాభివృద్ధినొంది యొకనాఁడొకచోట హరిహరులు యుద్ధమొనరింప నారంభించిరి. దేవతలు విమానారూఢులై తమయనిమిషత్వము సార్థకత్వమునొంద నాప్రచండద్వంద్వ యుద్ధమును జూడఁబోచ్చిరి. శివకేశవులును,

మ॥ తమచాపంబులుగేలఁబూని గుణసం • ధానంబుఁగావించి క్రో
ధముదాపూరుషయుగ్మమై నిలుచుచం • దంబొంద డీకొంచుఁ దీ
వ్రమహాస్త్రంబులొకళ్ళొకళ్ళపయి వ • ర్షంబోయనన్ గుప్పి దే
హములన్ గంతలుకంతలైచినుఁగున • ట్లత్యంతముం బోరఁగన్

కొంత సడియైన పిమ్మట,

ఆ॥వె॥ ఆవగింజయంత • నారియెక్కుడంచును
సూది బెజ్జమంత • సోముఁడలఁతి
యనుచునిగ్గయించి • హరిహరులను వేఁడి
రాజినిలుపుఁడనుచు • నమరతతులు.

సకలామరకోట్ల సంప్రార్థనమున వాసుదేవవామదేవులు క్రోధములుపసంహరించుకొని రణంబుచాలించిరి. ఈధనువులెప్పుడైన నిట్టి పోరునకవకాశము నొసంగునని తలఁచి శంభుఁడు తనచెంతనున్న దేవరాతుఁడను రాజునకుఁ దనవిల్లు నిచ్చెను. వంశపారంపర్యముగ నాధనువు జనకునకు వచ్చినది. నారాయణుఁడును దనకార్ముకమును రుచికుఁడను మునీంద్రునకొసఁగెను. ఆరుచికుఁడును నాజనకుఁడు జమదగ్నిమహామునికి దానినిచ్చెను. నాతండ్రియుఁదనకుమారులు నలువురలో నాభూరిచాపంబు నేనొక్కఁడ మోపెట్టి యుపయోగింపఁగలుగుట నద్దానిని నాకొసఁగెను. ఇదియాధనువుల చరిత్రము.

రాము — ధన్యోస్మి. శివకేశవులధనువుల పవిత్రచరిత్ర మెఱిఁగించి నన్ను మిక్కిలిపునీతునిఁ జేసితివి.

మ॥ మునివైయున్నను జామదగ్న్యుఁడు చలం • బుఁ శౌర్యముఁ గల్గియు
ష్ణను గోపంబుననుండువాఁడని జగం • బుల్ బల్కులే కాని నీ
మనమత్యంతముకోమలంబగును; నీ • మాటల్ మఱి జాలమె
త్తన? నీవిల్లుకృపాసముద్రుఁడని చి • త్రంబందు నెంచన్ జుమీ!.

పరశు — పుండరీకాక్షుని చాపంబును నాజనకుఁడు నాకిచ్చియుండెనని చెప్పితిని గదా!

క॥ సురలకెకాదేరికిదు
ర్ధరమయి మిడుఁగురుల సంత • తముఁజిమ్ముచు నా
కరమున లావునఁబొడవునఁ
బెరసెడు నీవిల్లె విష్ణు • విల్లు కుమారా!

క॥ ఈమహనీయశరాసన
మేమెయిమోపెట్టి శరము • నిటఁగూర్చిన నీ
తోఁ బోరొనర్చి యిప్పుడు గెలు
పో మఱియోటమో వహించి • పోవలెనాకున్.

నీపైనెత్తివచ్చి యుద్ధమొనరింప రమ్మని నిన్నుఁగోరుటలో నీవు మహేశ్వరచాపంబును విఱిచి యసమానయశంబు గడించితివా యశము నీకు నిలువనీయఁగూడదని దుర్భావము నాకులేదు. స్వయంవరమున సీతను గెలుచుకొంటివని నీయెడ నాకీర్ష్యయులేదు. ఇక్ష్వాకువంశజుఁడవును బాలుఁడవు నగు నీవింత కార్యమొనరింపఁ గలిగినందుకై నీయెడ నామనంబున మెప్పుగలదు. కాని,

మ॥ వినయంబార మహేశుచెంగట ధను • ర్వేదంబుసర్వంబు నే
ర్చిన యాహేతువుచేత నాఘనునకున్ • శిష్యుండనై యుండుఁ నా
తనిచాపం బెవఁడెక్కువెట్టు నతనిన్ • దర్పంబుమై సంగరం
బుననోడించెదనంచు నొక్కశపథం • బున్ దొల్లి నేఁజేసితిన్.

ఆప్రతిజ్ఞాపూర్తికై యీవిషయంబు విన్నంతనే నిన్నుఁజూడవచ్చితిని. నీవును వీరుండవు. కావున నింతకన్న నెక్కుడుగఁ జెప్పఁబనిలేదు. కర్తవ్యము నాచరింపుమా.

రాము — దేవా! నీగురుఁడగు మహేశ్వరునియెడ నీకుఁగలభక్తిశ్రద్ధలు జగజ్జనాభినందనీయములు. పురుషోత్తముఁడవును నిరుపమబ్రహ్మనిష్ఠసమూర్తివియు నగు నీవు ప్రతిజ్ఞను బూర్తిచేసికొనుట నాకేకాదెవ్వరికైనను బరమసమ్మతము. నీవు నిర్వర్తితప్రతిజ్ఞుండవు గావలసినదే? కావున,

చ॥ ధరణిధరేంద్రరక్తములఁ • ద్రావి కడున్ గడ వాఁడియాచు వా
దరలమిడుంగురుల్ గురిసి • తద్దయుఁ బొల్చు కుఠారకంబు నీ
కరముననుండు; దానిఁగొని • కంఠముఁ ద్రుంచుము; నీప్రతిజ్ఞదీ
ప్రవరతిసిఁదీర్పుమీక్షణమె; భార్గవ! నమ్ము; శిరమ్ము వంచెదన్.

దేవా! త్రికరణశుద్ధిగా వచించుచుంటిని. అవశ్యము నీకోరువిధంబున బ్రతిజ్ఞాపా

లనముఁ గావించుకొనుము. నేను మిక్కిలి సంతోషించెదను.

పర— (సాశ్చర్యము) రామా! నిన్ను నీ వెఱిఁగి మాటాడుచున్నావా? లేక పరాకున నున్నావా? నేఁ జేయుచున్న పని యేమి? నీవు చేసెడు పని యేమి? "నా ధను వెక్కిడుము. నీతో ద్వంద్వరణము జేసెద"నని చెప్పఁగాఁ "జంపుము. నీయిష్టము"ని శిరము వంచుచున్నావు. జీవహింస యొనరించు కసాయివలె నను జూచునట్లున్నది. ఊరక శిరము వంచిన నిన్నుఁ జంపునంతటి యధర్మవర్తనుండనని భావించితివా? నీవు పొరపడితివి. నేను నీతో రణముఁ గోరివచ్చి ముఖాముఖి కయ్యమున కియ్యకొనుమని యడిగితిని. నాకెన్నటికిని జుట్టుమాటలు రావు. నాకు నానియందిష్టమును లేదు. తోచిన సత్యము స్ఫుటముగఁ జెప్పుటయే నాకు వాడుక. కావున నీమనంబున నుత్సాహంబుఁ బెంపుము.

రాము— దేవా! నీ ప్రతిజ్ఞానిర్వహణమున కెదురాడువాఁడఁగానని యవశ్యము నీ ప్రతిజ్ఞఁ దీర్చుకొనుమని యట్లు విన్నవించుకొంటిని. కాని నిష్కారణముగ నీ మనస్సు నొప్పింపవలెనని యీషన్మాత్రమును నాకుఁ గోరికలేదు. ఒకవేళ నామాటలలో నీకట్లు తోచుట కేయవకాశమున్న నుదారబుద్ధితో మన్నింపుము. లోకారాధ్యచరిత్రుఁడవగు నీవు బాలుఁడనైన నన్ను రణమిమ్మనికోరుట గర్తయుక్తమని నాకుఁదోఁచదు.

తే॥గీ॥ రఘుకులజులైన రాజులు • బ్రాహ్మణులను
నిండుభక్తిని బూజింప • నేర్తుగాని;
కదనరంగంబులను వారిఁ • బోదివిపట్టి
నిశితశరముల నొప్పింప • నేరరయ్య!.

దేవా! నా విన్నపమాలకించి తృప్తిఁ బొందుము.

పరశు— నీవిన్నపములతో నేనెన్నటికిని దృప్తిఁ బొందువాఁడనుగాను. నేఁ జెప్పినదంతయు నీయెడఁ బూదిలో హోమమగుచున్నది. నాకట్టి సమాధానములు పనికిరావు. అటయట్లుండనిమ్ము. నిన్నొకటిరెండు మాటలడిగెద. సరిగ నుత్తరమిచ్చెదవా?

రాము — [illegible] చెప్పెదను.

పరశు — మంచిది. నా పరాక్రమమునుగూర్చి నీకేమి యభిప్రాయము?

రాము — త్రిభువనాతీతమని నా భావము.

పరశు — క్షత్రవిహారములవల్ల నా కీర్తినిగుఱించి నీతలంపేమి?

రాము — నీయంతటి వీరచూడామణి గడచిన కాలమునలేఁడు. రాఁగలకాలమునఁ గూడ యింతటివాఁడవతరింపఁడని నానిశ్చయము.

పరశు — నీవంటిరాజకుమారులకుఁ గీర్తికన్న నపేక్షణీయమేమున్నది?

రాము — దిగంతవిశ్రాంతమగు నాచంద్రార్కకీర్తి నాకేకాదెవ్వరికైన నపేక్షణీయమే. అందులో సందేహమేమున్నది?

పరశు — నీకిప్పుడు గొప్పకీర్తి రానున్న నీవు వలదనిచెప్పుదువా?

రాము — ధర్మవ్యతిరిక్తముగాకున్న నిస్సందేహముగా వలదనను.

పరశు — నేనేమైనఁ జెప్పిన నామాట నీవు పాటింతువా?

రాము — నాగురులగు వసిష్ఠవిశ్వామిత్రులయానతి యెట్లట్లు శిరసావహించెదను.

పరశు — అట్లయిన నేనొక్కటి చెప్పెద గ్రహింపుము. నాపరాక్రమాదులను గుఱించి నీవే చెప్పితివికదా? అట్టినాతో నీవిప్పుడు ద్వంద్వరణంబొనరించి గెలిచితివేని యీజగంబున నీకపారకీర్తి గలుగును. రాజలోకమునకుఁ జిరకాలమునుండి తటస్థించిన పరాభవక్లేశమును బాపితివని తరతరములవారును నిన్ను మఱువక కొనియాడుచుందురు. సమస్తవిశ్వంభరావలయమునఁ గల ప్రజాకోటులు నిన్ను మిక్కిలి గౌరవముతో సంభావింతురు. కీర్తి యతిశయించిన కొలఁదిని నీచేయఁదలఁచు మహాకార్యములు సులభసాధ్యములగుచుండును. కావునఁ జక్కఁగా యోజించుకొని రణమొనరింప నిశ్చయించుకొనుము.

రాము — దేవా! యితరస్థలములం దితరసందర్భములం దితరులతో నాకు రణమాచరణీయమైనఁ గావచ్చునుగాని నీతోఁబోరుట మాత్రము కేవలము ధర్మవిరుద్ధమని నామదిఁ దోఁచుచున్నది. కీర్తి యెంత యభ్యర్థనీయమైనదయినను ధర్మ

ము నుల్లంఘింపరాదు. ధర్మకార్యాచరణమునఁ గీర్తివచ్చినను రాకున్నను హృదయమునకు మాత్రము నిష్కళంకానందము గలుగును. ధర్మబాహ్యములగు కార్యములాచరించి యెట్లో తాత్కాలికమగు యశస్సు సంపాదింపఁగలిగిన నాయశస్సు సత్యమయినదిగ నుండఁజాలదు. అది వీరునకపేక్షణీయమునుగాదు. దాన నానందమునులేదు. యశోధర్మములలో ధర్మమే నాకుఁ బ్రధానము. నేనుధర్మమునకు లోఁబడెదను. మావంశమునందలి యిక్ష్వాకు హరిశ్చంద్రమాంధాతృరఘుదిలీపాదిమహారాజన్యచంద్రులందఱును బ్రాహ్మణులను గురువులనియు దేవతలనియుఁ జూచియారాధించుచుండిరి. అట్టివారో నేనిప్పుడు సంగ్రామమొనరించి పరమపవిత్రమైన సూర్యవంశమునకుఁగళంకముఁ గూర్పఁజాలనని నీకు నమస్కరించి విన్నవించుకొనుచున్నాను.

పర:—రామా! నీధర్మబోధనంతయు వినుటకుఁ జాలబాగుగనున్నది. "ఎవ్వఁడువచ్చి రణమునమున నెప్పుడు చేతులెత్తుటవోఁ బోరాడఁగల్గు?"ననియుండదును గాని వీరుఁడెప్పుడు నీవలె నిరుత్సాహముతో నుండఁడు. చూడఁజూడ నీహృదయమున భయభ్రాంతులే యున్నవి కాని వీరక్షాత్రములణుమాత్రమైన లేవు. శత్రువును జూచి భయపడువాఁడు క్షత్రియుఁడే కాఁజాలఁడు. నీవెంతయాలోచించినను నాతోయుద్ధము మాత్రమనివార్యము. ఎట్లునుఁదప్పని యీసమయమునకై నీవుభయపడి వెనుదీయుటకన్న ధైర్యమున నన్నెదిరి నిలుచుటయే నీకు శ్రేయస్కరము. నీవు భయపడి యెన్నినమస్కారములొనరించిన నెన్నియుపచారములు చేసినను నేను మఱలిపోవువాఁడఁగాను. నమస్కారములతో నన్నుసదలించుకొనఁజాలవు.

రాము:—విధేయతాసంపన్నమైన నాహృదయమును దేవర కొండొకతెఱంగున నష్టముచేసికొన్నందులకయి నాకుమిక్కిలి చింతయగుచున్నది. నీతో యుద్ధము ధర్మయుక్తముగాదని నాకుఁదోచనందున నీకు నమస్కరించి విన్నవించితినే కాని నీవు నన్నేమేనిఁ జేయుదువని భయము నాకులేదు. వదంతినలవ జను మనోనఁగా వినుటయేకాని భయమనునది నాలోఁగలుగఁగా నేనెప్పుడెఱుంగను. నేను నీతోరణము చేయుటకే నిశ్చయించుకొంటినేని నేనకార్యముఁ జక్కఁగా నిర్వర్తించి నీమెప్పునొందఁగలనో లేనో నాహృదయమే యెఱుంగును. నీవొకింత కఠినముగఁ బల్కినను నేనన్యథా భా

విన్నపము. దేవా! యీ విషయమున నామనస్సునఁగల యభిప్రాయమును వి
శదీకరించుకొనెద.

మ॥ మునిపుత్రుండవు బ్రాహ్మణుండవు తపః ♦ పూజ్యుండవా ప్రైజనా
ర్దనరూపుండవు పెద్దకాలమును నీ ♦ రక్షేష్ఠుఁడన్ బేరుని
ల్పినధీరుండవు నేఁడు వృద్ధుఁడవు రణ ♦ క్లేశంబు నీకేల? వం
దనముల్ జేసెదఁ గోపముల్ విడిచి శాం ♦ తంబూనుమా! భార్గవా!

పరశు — ఇప్పుడిప్పుడు నీగుణము బయల్పడుచున్నది. పైకిఁ జూచుటకేమో నీమాటలయందు వినయము గనఁబడుచున్నదే కాని లోనెంతయుఁ బెంకెతనమున్నది. నీవనుటలో నాతో మార్కొన ధైర్యమేగాను. నన్ను మీఱఁగలవని కూడ సూచించుచున్నావు. ఓయి పిడుగా! నీగర్వమెంతవఱకుఁ బోయియున్నది. పైన నాకు వృద్ధుఁడనని యొకపేరు దెచ్చి పెట్టియున్నావు.

మ॥ పరశుస్ఫారకఠోరధారలను బ ♦ ర్వల్ జేసి దుర్దాంతసం
గరరంగంబున నేను నీతనువుఁ బ్రవ ♦ క్కల్ ప్రక్కలుల్ జేసి కో
పరసస్ఫూర్తి వెలుంగువేళలను నీ ♦ బాల్యంబు నావృద్ధతా
భరమే పాటివో వీరులెల్లను నుతిం ♦ పంగా వినన్ లోకముల్.

ఆహా! కథ కెంతకు వచ్చినది.

తే॥గీ॥ తలిరులను బోలె నృపకోట్ల ♦ తలలు గిల్లి
ధీరుఁడని పేరుగనిన నన్ ♦ దెలియలేక
ముదుకఁడని పల్కెదే? వింటి ♦ పోటు కాకి
పిల్ల యెఱుఁగునె? యో[illegible] పెంకికొడుక!

ఆహా! నక్షత్రియుఁడు బ్రాహ్మణుఁడనియు నందువు? ననయుద్ధము సేయఁజాలననియుఁ బలుకుచుంటివా? బ్రాహ్మణులు మీ రాజసంతానముకంటె చులకనఁ గనఁబడుచున్నారా! ఓహో తెలుంగని శివమా! రాజులకును విప్రులకునుఁగల తారతమ్యము ఈ లోకములన్నియు నెఱుఁగును. ఈ విశ్వామిత్రుఁడు రాజ్యసంపన్నుఁడౌ బాంధుఁడై తొలుత నీకులగురుండౌ వసిష్ఠునితో విరోధించి యెన్నిమారులు భంగమునొందె

నో యోజించుకొనుము. గాధేయుని యస్త్రములన్నింటిని వసిష్ఠుని బ్రహ్మదండ మొక్కటియే పాఱ మ్రింగెను. విశ్వామిత్రుఁడిప్పుడు బ్రహ్మర్షియై యుండియు వసిష్ఠునితోఁ దులఁదూఁగఁజాలఁడు. బ్రహ్మబలరాజబలముల తారతమ్య మెఱిఁగింప నిలిచియున్నారన వసిష్ఠవిశ్వామిత్రులిరువురును నీకన్నుల యెదుటనే నిలిచియున్నారు చూడుము. సప్తసముద్రోదకముల నాపోశనముగాఁదీసికొని వింధ్యపర్వతము గర్వము సర్వముఁబాపిన యగస్త్యుఁడు బ్రాహ్మణుఁడేయని యెఱుంగుము. ఇట్టి తపోధనచక్రవర్తులెందఱో గలరు. ఇప్పుడు నీతో నిన్నిమాటలేటికి? నిన్ను నేను విడుచువాఁడఁగాను. ఒకవేళ నీవు నిలువక వెన్నుజూపినను నిన్నుఁ బోనీయక పొదివి పట్టెదను.
[అస్త్రగించుచున్నాఁడు.]

రాము — [స్వగతము] అయ్యో! యేమి చేయుదును? ఇతనితో వైరమును యుద్ధమును దప్పవని తోఁచుచున్నవి. [వసిష్ఠునిజేరి]

మ॥ ప్రళయాగ్నిన్ బలె బిట్టుమండుచును నా ♦ పైవచ్చి యీ భార్గవుం
డలఘుప్రాభవుఁడెంత వేడినను నుం ♦ తైనన్ గృపన్ జూడఁడె
ట్లులనేనీతని శాంతుఁజేసి బహుళా ♦ టోపంబుదగ్గించి నా
కిలలో బ్రాహ్మణవైరదుష్కృతము రా ♦ నీకుండఁగాపాడవే!

మహాత్మా! యితని బాహాబల విక్రమములకై జంకుటలేదుకాని బ్రాహ్మణునిపై నెట్లు శరప్రయోగ మొనరింపవలెనని శంకించుచున్నాను. ఈసందిగ్ధావస్థలో నీయమూల్యాభిప్రాయమునొసఁగి నన్నొకదరిఁజేర్పుము.

వసి — రామచంద్రా! దీనికింత విచారమేటికి? నీవె భార్గవునిపైకేగి రణమునకు రమ్మని పిలువలేదుకదా! మఱియతఁడైవచ్చి నిన్నుఁదొందరపెట్టుచున్నాఁడు. కావున నతనియానతిఁచొప్పున నీవు రణమునకుఁ దొరకొనుట ధర్మవిరుద్ధము కాఁజాలదు. ఇంతకతఁడు గోరునది తనచేనున్న వైష్ణవశరాసన మెక్కిడుమనియేకదా? నీవు సంశయింపవలసినదేమున్నది?

రాము — శరాసనము నెక్కిడుటలో నాకు సందేహింపవలసినది లేదుకాని నేనావిల్లెక్కువెట్టి శరసంధానముఁ గావించితినేని యది యూరక యుపసంహరింపఁబడదు. నేనప్పుడీమహాత్మునిపై దానిఁ బ్రయోగింపవలసివచ్చును. అందుకై

నాడెందము కొందలపడుచున్నది.

వసి—దానికై నీకేలవిచారము? నీవు బాణమును సంధించినతోడనే భార్గవుండే యందులకుఁ బరిహారముఁ జెప్పికొనును. అతఁడు కోరినపనిని జేయుట నీకుధర్మము. ఆవ్వలి విషయము నీకేటికి? అతని యిష్టము.

రామ—అట్లయిన ధనువు మోపెట్టి పరశురామునితోఁ బ్రతిఘటించి నిలువనచ్చునందువా?

వసి—ఎట్టిసంశయమును లేక. అయిన రామా! నీవా మహాత్ముని యెడ సంభాషణమాత్రమైన నవిధేయతఁ జూపఁగూడదుసుమా!

రామ—వినయముతోడనే వర్తించి మీకు సంతోషముఁ గూర్చెద. (పరశురామునిఁ జేరి.) దేవా! యెంతదూరమాలోచించినను నీతో యుద్ధము చేయఁదగ్గదిగా నాకుఁ దోపలేదు. నీవునభిలషింపఁదగినదికాదు. ఇందుఁగలవ్యత్యాసమును నీవుగ్రహించియుండకపోవు. నీవత్యున్నతవంశసంభవుఁడవు. నేను రాజమాత్రుఁడ. నీవు వయోవృద్ధుఁడవు. నేను బాలుఁడ. నీవు నిరుపమజ్ఞానధురంధరుఁడవు. నేనకృతబుద్ధిని. ఇఁక నీపరాక్రమము బ్రహ్మేంద్రాదుల మించినది. లోకసంత్రాసకరపరాక్రమయుక్తులగు కార్తవీర్యార్జునాదివీరమండలాధీశుల ననేకులఁగూల్చి జగంబున నజరామరమైన కీర్తినిసంపాదించితివి. నేను తాటకయను నొకదానవినిఁగూల్చి మారీచసుబాహులను మాత్రమోడించితిని. నీమహావిక్రమము ముందఱ నాపరాక్రమము శతాంశముగాను సహస్రాంశమైనఁ గాఁజాలదు. నీవు వీరాతివీరుండవని భువనములఁ జిరకాలము కీర్తినొందినవాఁడవు. నాపేరు రాముఁడని యింకను నలువురైన నెఱుంగరు. నీవు జగంబునఁ జేయఁదలఁచిన పనులన్నియు నిర్వహించి యనేకవీరవిక్రమవిహారము నొనరించి మత్తేభమువలె నుదారవృత్తితో మెలంగి కృతకృత్యుఁడవైన మహానుభావుఁడవు. నేను జీవితము నిప్పుడిప్పుడు ప్రారంభించువాఁడను. అట్టినో జగద్విశ్రాంతయశోధన్యుఁడవైన నీవు జగంబున నింకను జేతననిల్పుకొనని నన్ను గెలిచినను నీకీర్తి యొక్కువకాఁజాలదు. ఎట్లుచూచినను మనకిరువురకును సమత్వములేదు. హస్తిమశకాంతరమేకలదు. కావున నోదేవా!

తే. గీ. పద్మజునికన్నఁ బార్వతీ ◆ భర్తకన్నఁ
బ్రాభవంబున నెక్కుడు ◆ వాఁడవగుటఁ

త్వన్మృదుపదారవిందవం ♦ దనమొనర్చి
ప్రార్థనమొనర్తు; రణకాంక్ష ♦ వదలుమయ్య!

పరశు — ఇదియా నీగురుఁడు వసిష్ఠుండింతసేపును నీకు బోధించినది? నీయుపచారములతోఁ బనిలేదని నేను పలుమారు చెప్పితిని. నీవిట్టిపిఱికివాఁడవని నేను తలంచియుండలేదు. నీకును నాకును నిక్కముగ సమత్వములేదు. అయిన నీయుద్ధములో నాకుఁగొండొక యుద్దేశమేకలదు. దానితో నిప్పుడేటికి? నీవెన్నివిధముల భక్తులుచూపినను నేను వదలను. ఒక్కనిమిషమైన వ్యవధినొసంగను. ఈదినము భార్గవరాముఁడో దశరథరాముఁడో యిరువురలోనొక్కఁడే వీరుఁడనిపించుకొనవలయును. రమ్ము.

రాము — అయ్యా! సాధ్యమగునంతకు నీతో వినయమున విన్నవించుకొంటిని. నీ మానసము తిరుగకున్నది. నేనేమి చేయుదును? నాకును దుర్వారభుజాటోపము గలదు. నీధనువునెక్కిడుట నాకొకపుల్లను వంచుట వంటిదగును. యుద్ధమునఁ గలకాలము జయమొక్కరిపక్కనే యుండదు. అది చేతులుమార్చికొనుచుండును. నీవు చిరకాలము గష్టపడి జగంబున వీరుఁడనియేకాదు. వీరులలోఁ బూర్వాభిగణ్యుఁడవని పేరుఁగాంచినవాఁడవు. నీపేరునకు భంగము రానీయఁగూడదని నేనింత దూరమొగ్గిచెప్పుకొంటిని. నీదివ్యచిత్తము యుద్ధమునే కోరుపక్షమున నేను సిద్ధముగనేయున్నాను. ఏదీ నీవింతసేపటినుండి యనుచుండిన యాయుద్ధమెట్టిదో చూపుము. నేను చూచెద. ముందుప్రారంభింపుము.

పరశు — నీమాటలు మేరమీఱుచున్నవి. అల్పయిన నిన్నుఁజూచి నేనేఁటియాపటి మారమున నొదిగియుండవలసినది కాఁబోలు. ఆహా! యేమి నీగర్వము.

ఉ॥ కూరలనెల్ల వ్రక్కలుగఁ ♦ గోసెడుపాచకునట్లు పూర్వము
ర్వీరమణాళులన్ సమర ♦ వీధినిఁగూల్చి కళేబరంబు లిం
పారఁగ భూమినుండి దివి ♦ యంతకు మెట్లుగఁ బేర్చి స్వర్గమున్
జేరఁగ నాదుపూర్వులను ♦ జెచ్చెరఁ బంపితి లోకమెన్నఁగన్.

ఇరువదియొక్కమారు సమస్తవిశ్వంభరాభారధౌరేయులగు మూర్ధాభిషిక్తసంఘముల

నుఉమాడి తచ్ఛిరంబులఁ బాదిగానిడి కళేబరంబుల సోపానములుగా నమరించి నాపితరుల స్వర్గమునకుఁ బంపిన వీరాగ్రేసరుఁడ. ఈశ్వరుఁడు ధనుర్విద్య నేర్పినప్పుడు కుమారుఁడు నాతో మార్కొని నిలువలేక యోడె. అప్పుడు నాపరాక్రమమునకు సంతసించి యీశ్వరుఁడీశరాసనము నాకొసంగెను. వైష్ణవ శరాసనమును బరశువును ధరించిన నన్నుఁజూచి దేవతలైన వడఁకుదురు. నా క్రోధాగ్నిఁబడి త్రిమూర్తులైనఁ బ్రతికిపోఁజాలరు. అట్టి నాతో నీవా మార్కొనఁగలవు? అంతయేటికి? నీలో వీరమావంతయైన నుండునేని యిదిగో యీ కార్ముకము నెక్కిడుము. (క్రిందవైచి) ఎంతకాలము నుండియో మూలఁబడి నుసిపట్టిన యీశ్వరుని పాతవిల్లును విఱుచుట యొకమగంటిమికాదు. పరశురాముఁడన మారీచాదులవంటివాఁడనుకొంటివి కాఁబోలు. కార్యమునకుఁ గడంగుము.

రాము—పరశురాముఁడన లోకాతీతమహాబలశౌర్యములుగల యోధాగ్రేసరచక్రవర్తియనియే నాతలంపు. నీవు పెక్కురు రాజన్యులఁ జంపి వీరవిహారములొనరించినమాటయు నిశ్చయమేయగును. అయిన నిష్ఫలమాటలతో నేమి? నీ పరాక్రమాదులు నాకు భయముఁ గలిగింపఁజాలవు.

క॥ ఒకపరశురాముఁడేటికి?
సకలజగత్త్రయము పైకిఁ ♦ జనుదెంచునుగా
కొకత్రుటి దశరథరాముఁడు
వికలంబుగఁజేయనోపుఁ ♦ వెఱవఁడు దేవా!.

ఇఁకమాటలతోఁబనిలేదు. కార్యమునకువచ్చుచున్నాను.

[అనివిల్లునెక్కొని పరశురామునిఁజూచి]

మ॥ కరిరాజంబు మృణాళముఁగరమునన్ ♦ గైకొన్నచందంబునన్
గరమందుగ్రహియించియెక్కిడితి నీ ♦ కంజాక్షుచాపంబు; భీ
కరబాణంబునుగూర్చియాడ్చితిన మో ♦ ఘంబయ్యె! నాబాణముల్
కరుణన్ జూపిన నీపదంబులు తెగం ♦ గానేతు నో భార్గవా!

నీకోరికప్రకారము వైష్ణవశరాసనమునుబట్టి గుణసంధానంబు గావించితి. నాబాణము

కోపాఘాతము. అనుమతింతువేని దీనినీపాపములపైఁ బడవేద.

పరశు — (చిఱునవ్వుతో) రామచంద్రా! నీవీయుత్తమచాపంబు నెక్కిడఁగలవని నేనెఱుంగుదును. నీబాణమమోఘమనియుఁ దెలియుదు. నేనింతదూరము వచ్చి బట్టి నిన్నేటికిఁ బరీక్షించితినో చెప్పెద. కాని ముందుగ నొకవిషయము వినుము.

మ॥ ధరసర్వస్వము నేనుకశ్యపునకున్ ♦ దానంబుగావింప రా
తిరిభూమిన్ దిరుగాడకంచతఁడు ప్రా ♦ ర్థించెన్; మహేంద్రావనీ
ధరమున్ జేరుదురేలఁ గావునను మ ♦ త్పాదంబులన్ మాని నీ
శరమున్ నాదుతపోబలంబుఁగొనఁగా ♦ శాసింపుమా! యీయెడన్.

నాయెడ నీకుఁగలగౌరవమునకుఁ దార్కాణగా నామాటవిని నాతపోబలమును మాత్రము నీవు గైకొనుము.

రాము — అవశ్యము నీయాజ్ఞను విధేయుఁడనయ్యెద.

మ॥ ననుఁజాపంబునఁగూర్చితీఘునుని ప్రా ♦ ణంబిప్పునాకీయలే
దని చింతింపకితండు బ్రాహ్మణుఁడు పు ♦ ణ్యాత్ముండు దేవవ్రజం
బునకున్ బూజ్యుఁడు గానఁగోపమఖిలం ♦ బున్ వీడి కారుణ్యమున్
గొని యివ్వీరుతపోబలంబులను గై ♦ కొమ్మన్న! శరశ్రేష్ఠమా!.

దేవా! శరము నుపసంహరించితిని.

పరశు — ఉదారబుద్ధితోఁ బ్రవర్తించితివి. చాలసంతసించితిని. రామా! నీవిక్రమము ధనుర్వేదమున నీకుఁగల పాండిత్యమును నాకబ్బురమును గలిగించినవి. నేనిచ్చటికివచ్చుటలో నాకుఁగల యుద్దేశమును దెలిపెదవినుము. లోకమున ధర్మమునకుఁ జ్యాతియెప్పుడుకలుగు నప్పుడు దుష్టశిక్షణమును శిష్టరక్షణమునుబూని మహావిష్ణువవతరించునని తెలియునుకదా? ఆదికాలమునఁ బుండరీకాక్షుఁడు మహామీనావతారమెత్తి సోమకుని సంహరించెను. పిదపఁగూర్మమై యావిర్భవించి యనేకదైత్యుల గీటడంచి దేవతలనుద్ధరించెను. అన్నవరాహనృసింహావతారములెత్తి హిరణ్యాక్షహిరణ్యకశిపుల పొంగడంచెను.

తరువాత వామనుఁడనై యుదయమొంది బలిచక్రవర్తి గర్వనిర్వాపణంబొనరించెను. ఇటులైదవతారములయందును దుష్టదానవసంహారము గార్యముఁగాఁగొని నిర్వర్తించియుంటి. ఇంతలో రాజులలోఁ బెక్కురు దుర్వర్తనమునకు దిగి జగత్క్షోభము గావించుచుండ నేనవతరించి యిరువదియొక్కమారు నృపాలకోటులను రూపుమాపి దౌర్జన్యమును వారించితిని. వదుపుఁగొంతకాలవధి లభించినందున రాక్షసులు దవానలముసోఁకిన యారణ్యకంటకవృక్షములు కొండొకకాలమునకుఁ జివురెత్తినట్లు మఱలనిప్పుడు వృద్ధినొంది హింసాపరాయణులై మునులను దేవతలను బాధించుచున్నారు. దానవసంహారమునకై యిప్పుడు నారాయణుఁడు మఱల నవతరింపవలసియుండినది. నేను విశ్రాంతి గొనవలసియుండినది. జనార్దనుని సప్తమావతారమునకై నేనెదురుచూచుచుంటిని. ఇంతలో నీవీశ్వరునివిల్లు విఱిచితివనివిని నీవు విష్ణ్వంశసంభూతుఁడవాయని తెలిసికొనఁగోరి యిటువచ్చి నాచేనున్న శరాసనమును మోపెట్టుమని నిన్ను నిర్బంధించితిని. కాని నీతో యుద్ధమొనరింపవలెననుతలంపున వచ్చినవాఁడను గాను. నిన్నుఁ దాఁకుటయే నా కిష్టమైయుండిన విల్లెక్కుపెట్టుమని యింతదూరము నిన్నుఁ దఱిమియడిగియుండను. ఆపనితో నవసరమునులేదు. ఒక్కుమ్మడిగవచ్చి పైఁబడియుందును. నిన్నుఁ బరీక్షించుటయే నాముఖ్యోద్దేశము గావున విల్లెక్కిడుమఱకు నిన్నుఁజాల నిక్కచ్చి యొనరించితిని. నీవా కోదండము మోపెట్టి చతుర్భుజాంశజుఁడవగుటను రూఢిసేసితివి. నేనును నారాయణాంశజుఁడనగుట మనకిరువురకు భేదములేదు. వైరమంతకుమున్నె లేదు. ఒక్కవిశేషము. విల్లువంచుమని చెప్పుటలో నేనెంతయో కఠినముగఁబల్కితిని. ఎత్తిపొడిచితిని. దూఱితిని. కాని నీవిసుమంతయుఁదొందరపడక కోపించుకొనక పరమశాంతముతోడను వినయముతోడను వర్తించితివి. నీధనుఃపాండిత్యమునకు నీవినయము మఱింత వన్నెదెచ్చుచున్నది. నీనడవడికి నేను మిక్కిలిసంతసించియున్నాను. రామచంద్రా! యీ వైష్ణవశరాసనముతో నాకిఁకఁ గార్యములేదు. దీనిని నీవుపరిగ్రహించి యుపయోగించుకొనుము. ఈధనువునుధరించి నీవు త్రికాలములందలి ధనుర్ధరులలో నత్యుత్తముఁడవై యలరారుదువుగాక. నీకు సకలకల్యాణములు గలుగుఁగాక.

రాము:— దేవా! నాయెడఁగల యాదరమున నట్లనుచుంటివేకాని నీవు సంతసింపఁద

గిన యోగ్యత నాయొద్ద నిక్కముగ లేదు. ఈయుద్ధము నెపముగా నాకు నిశ్చలతపోబలమునిచ్చి లోకమున నాకుధారాళకీర్తి గలిగింపవచ్చిన నీమహోదారహృదయము నేనెంతని కొనియాడుదును? నీవాశీర్వదించియిచ్చిన యీకార్ముకోత్తమమును గ్రహించి యనవరతము నాప్రాణపదముగఁ జూచుచుండెద. దేవా! నీదివ్యదర్శనమున నేనెన్నియోలాభములు వడసితిని. మిక్కిలి కృతజ్ఞుఁడ నగుచున్నాను.

దశ—(స్వ) అబ్బ! యిప్పటికి నాకుఁ బ్రాణము వచ్చుచున్నది.

వసి—ఇది మిక్కిలిసుదినము. పద్మనాభుని యవతారమూర్తులగు మీరిరువురు నొక్కమారు గనబడితిరి. ఇంద్రధరశతానందాదిబృందారకబృందములకైన దుర్లభమగు మీదర్శనము లభించి మేము ధన్యులమైతిమి.

విశ్వా—మాయానందమునకు మేరలేదు.

రాము—దేవా! యాశీర్వదింపుము.

ప:—

సీ॥ సర్వసర్వంసహా ♦ చక్రమంతయును దు
ర్భిక్షంబులేకుండ ♦ వెలయుఁగాక;
తనయులు లేరని ♦ వనటనొందు నపుత్ర
కులకుఁ బుత్రకులు గ ♦ ల్గెదరుగాక;
ప్రబలదైతేయుల ♦ వలన భంగము లేక
సవనంబు లేవేళ ♦ జరగుఁగాక;
కన్యలు కులశీల ♦ గౌరవంబులఁ బేరు
నెందుభర్తల గృహిం ♦ చెదరుగాక;

తే॥గీ॥ వినయధర్మంబులు వెలుఁగఁ ♦ బిన్నవారు
గురులనెల్లప్డు భక్తితోఁ ♦ గొల్తురుగాక;
యాయురారోగ్యభోగభా ♦ గ్యములుగలిగి
క్షితిసమస్తజనము రహిం ♦ చెదరుగాక.

సూ — తథాస్తు. తథాస్తు.

[అందఱు నిష్క్రమించుచున్నారు.]

గద్య:— ఇది శ్రీమత్కామేశ్వరీకరుణాకటాక్షవీక్షాసమా
సాదితరసవత్కావ్యనిర్మాణచాతురీధురీణ, శతావధాన
విధానపారీణ, మఱ్ఱాఫికవంశ దుగ్ధాంభోరాశిరాకా
కైరవమిత్ర, శాలంకాయనగోత్రపవిత్ర, వేంక
టరామార్యపుత్ర, కవిసింహబిరుదవిఖ్యా
త, సుకవిరాజశేఖర, రాజశేఖర ప్రణీ
తంబైన శ్రీమద్రామాయణమున
సీతాకల్యాణమను నా
టకమునందు
అంకము

సంపూర్ణము.



జానకీ ముద్రాక్షరశాల, పొన్నూరు.